

# గోదా గీతమాలిక



[తిరుప్పావుకు ఆంధ్ర స్వేచ్ఛానువాదం]




మత గ్రంథాల ప్రచురణకు సహాయ పథకం క్రింద
శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానంవారి ఆర్థిక సహాయంతో
ఈ గ్రంథం ప్రచురింపబడినది.




—భావశ్రీ


శ్రీ శ్రీనివాసా పబ్లికేషన్స్,
సంతవురిటి. (వయా) పొందూరు, శ్రీకాకుళం జిల్లా.

గోదా గీతమాలిక
(తిరుప్పావుకు అనువాదం)
'భావశ్రీ'

ప్రతులు : 750

ముఖపత్ర రూపకల్పన :
వి. శంకరరావు, ఆర్టిస్టు

ప్రచురణ : 1997



మూల్యం : ఇరవై రూపాయలు

ముద్రణ :
వేగుజుక్క పవర్ ప్రింటింగ్ వర్క్సు
రాజాం.

ప్రతులకు

'భావశ్రీ'
గ్రామం : సంతవురిటి [B. O.]
వయా : పొందూరు [B. O.]
పిన్ : 532 168
జిల్లా : శ్రీకాకుళం
ఆంధ్రప్రదేశ్



SRIMANNARAYANA RAMANUJA YATHIBHYONAMAHA

**_TRIDANDI CHINNA SRIMAN-NARAYANA RAMANUJA JEEYAR SWAMI._**

JEEYAR EDUCATIONAL TRUST

**SITHANAGARAM - 522 501**

GUNTUR DISTRICT

© 91 - 866 - 426929

ప్రియ శ్రీమాన్, భావశ్రీజీ!
**శ్రీమతే నారాయణాయ నమః**
**అనేక మంగళాశాసనములు!**

మీరు పంపిన 'గోదా గీత మాలిక' అందింది. అలరించింది. శ్రీరామ చరితను ఎందరెందరు ఎన్నెన్ని రీతులలో పాడినా యింకా నిత్య నూతనంగా వెలుగొందుతున్నట్లు 'తిరుప్పావై' గూడ గోదా వాఙ్మాలికగా నిత్య పరిమళాలను గుబాళిస్తూనే ఉంది. ఈ వరకే ఎందరెందరో వ్యాఖ్యలు అలరించినా, మరెందరో భావుకులకు అది స్వాగతాన్ని పలుకుతూనే ఉంది. ఇదివరకు ఆ విషయం తెలియక దానిని స్పృశించలేదు ఎందరో. ఇప్పుడిప్పుడు ఈ ప్రబంధ సౌందర్యాన్ని ఆస్వాదించే ఉద్యమ మారంభమైంది. ఇది సమాజానికి శుభోదర్కం.

మనిషికి కర్తవ్యాన్ని ప్రబోధించేది తిరుప్పావై.

సమ్యక్‌దృష్టినిచ్చి, తోటివ్యక్తిని ప్రేమించేవిధానం నేర్పేది తిరుప్పావై.

ప్రతి మనిషీ కోరదగిన పురుషార్థాన్ని స్పష్టపరిచేది తిరుప్పావై.

జీవన సాగరములో ఓ అద్భుతమైన 'ఓడ' తిరుప్పావై.

మనిషి ఎదుర్కోవలసిన ఒడిదుడుకులను చూపి, ఎలా పరిష్కరించుకోవాలో నేర్పేది తిరుప్పావై.

సజ్జన సాంగత్యాన్నిచ్చేది తిరుప్పావై.

సమన్వయ రీతిని తెలిపేది తిరుప్పావై.

శ్రీకృష్ణుని తెచ్చి, ముందు నిలిపేది తిరుప్పావై.

మాటలాడే తీరును నేర్పేది తిరుప్పావై.

సర్వ వేద నిధానమీ తిరుప్పావై.

సర్వ జనులకు సులభ గ్రాహ్యమైనది తిరుప్పావై.

సర్వ విద్యా మూల భూతమైన జ్ఞానాన్ని స్వచ్ఛముగా ప్రకాశింపజేసేది తిరుప్పావై.

మీరైన బాణీలో మీరు ఈ తిరుప్పావైని అందించడం, దాన్ని అందరికీ అర్థమయ్యేట్లు వివరణ, వ్యాఖ్యలతో అనతి దీర్ఘంగా అందించడం చాల బాగుంది. సముచితం.

మీ ఈ కృషి గోదాతల్లి హృదయమునందు గైకొనుగాక! మీరిట్టి సద్గ్రంథ ప్రచారమును, తద్వారా ధర్మరక్షణను బహుళముగ చేయగలుగు శక్తిని గోవిందుడనుగ్రహించు గాక!



భాషాప్రవీణ, పండిత ;
ఆరవెల్లి లక్ష్మీనారాయణాచార్యులు
కార్యదర్శి : ఉపనిషన్మందిరం
సంస్కృత పండితుడు.

శ్రీకాకుళం - 532 001
తే 17-10-1997 దీ
శుక్రవారం

శ్రీశః శరణమ్

# మున్నుడి

కర్కటే పూర్వఫల్గున్యాం । తులసీ కాననోద్భవాం
పాండ్యే విశ్వంభరాం గోదాం । వందే శ్రీరంగనాయకీం॥

శ్రీకాకుళం జిల్లా సంతవురిటి వాస్తవ్యులు, మిత్రులు, శ్రీ'భావశ్రీ' గారు తమిళ భాషలో ప్రసిద్ధమైన కృతియగు "తిరుప్పావై" అను మహిమాన్వితమైన గేయకావ్యమును ఆంధ్రభాషయందు స్వేచ్ఛానువాదము ఒనర్చి "గోదా గీతమాలిక" యని పేరుంచినారు నాయందలి ఆదరముతో నన్ను గోదా గీత మాలికను బరిశీలించి, యభిప్రాయము నిమ్మని కోరినారు. పరమానందముతో నంగీకరించినాను

దక్షిణ భారత దేశమున ఆయా కాలములలో భగవదాదేశమున నవతరించి, ప్రజలందరికి నందుబాటుగు రీతిలో ప్రజలభాషలో భగవంతుని అవతారములంగూర్చి, మహిమలనుగూర్చి పాటలు పాడుచు,తాము తరించుటయేగాక ఇతరులను తరింపజేసే మహానుభావులు,కృపాళువులు పన్నిద్దరాళ్వార్లు. వారి రచనలు నాలుగు వేల పాశురములు. వీనికి 'నాలాయిరము' అని వ్యవహారము. ఈ నాలాయిర దివ్య ప్రబంధము నకు ద్రవిడ వేదమని పేరు.

ఇందు సాహిత్యపు విలువలు – కవితా సౌందర్యముతో పాటు కర్మ - జ్ఞాన - భక్తులు - వైరాగ్యము - శరణాగతి మున్నగు భగవత్ప్రాప్తి మార్గములు వర్ణింపబడినవి. అగస్త్యమహర్షిచే సంస్కరింపబడిన తమిళ భాషలో రచియించిన ఈ దివ్య ప్రబంధాధ్యయనమునకు భగవత్ప్రీతి గల వారెలరికిని అరత ఉన్నది.

సర్వులకుపయోగపడుట యన్నదే ద్రావిడ వేదము యొక్క ఉత్కృష్టత. ఇట్టి భగవత్ప్రీతికి తావలమైన దివ్య ప్రబంధములలో వేద మంత్రములకు "ఓం"కారమువలె ప్రథమ గణ్యములు. 1. పెరియాళ్వార్ల "తిరుప్పల్లాండు", 2. శ్రీ గోదాదేవి పాడిన "తిరుప్పావు" ప్రబంధములు. పెరియాళ్వార్లకు 1. భట్టనాథులు, 2. విష్ణుచిత్తులు అని వ్యవహారము కలదు. వీరికి తులసి వనంలో జనకునకు యాగభూమిలో లభించిన 'సీత'వలె లభించి,భగవత్పరిగ్రహపాత్రయైనది శ్రీగోదాదేవి.

ఈమెకు అండాళ్, చూడిక్కొడుత్త నాచ్చియార్ అను పేర్లును కలవు. తాను ముడిచిన మాలను భగవంతునికి సమర్పించినది అను నర్థము వచ్చునట్లుగ సాహితీ సమరాంగణ సార్వభౌముడగు శ్రీ కృష్ణ దేవరాయలు "ఆముక్తమాల్యద" అను సంస్కృత నామముతో తెలుగున ప్రబంధమును రచించినాడు.

పురశ్చూడ శాఖకు చెందిన ద్విజుడు, పరమ భాగవతుడైన విష్ణు చిత్తుడను సార్థక నామధేయుడగు పెరియాళ్వార్లు వల్లభదేవుడను పాండ్యరాజు కొలువులో వివిధ మతానుయాయులగు పండితులయెదుట నారాయణ పరత్వమును సిద్ధాంతీకరించి, ఆ మహారాజు నెడదనున్న సంశయమును నిర్మూలించి, ఆ మహారాజుయొక్క గౌరవాదరములకు పాత్రమైనవాడు. అట్టి విష్ణుచిత్తునిచే అల్లారు ముద్దుగ పోషింపబడుచు, ఆ బాల్యము భగవదనురక్తయై, వయస్సుతోపాటు భగవత్సంశ్లేషాశయు గాటము కాగా, ద్వాపరమున గోపకన్యలు శ్రీకృష్ణానుభావ ప్రేరితులై తమ ఆశయ సాఫల్యమునకై కాత్యాయనీ వ్రతాచరణమొనర్చి, శ్రీకృష్ణానుభవమును పొందిరను శ్రీమద్భాగవత కథను తండ్రిగారి వలన విని, "యద్దుర్గమం యదురాపం యద్దుర్గం యశ్చ దుస్తరం, తత్సర్వం తపసా ప్రాప్యం" అను నార్యోక్తి ననుసరించి, ఈ దేహముతోడనే భగవత్ ప్రాప్తికై "మార్గళి" వ్రతము నాచరించి, తత్ఫలముగ శ్రీరంగనాథుని అనుగ్రహముచే నాతనిచే పరిగ్రహింపబడిన విధానమును వివరపరచు ప్రబంధమే తిరుప్పావు

ఈ వ్రతము స్నానవ్రతము. "చైత్రశ్రీ మానయం మాసః" అని త్రేతా యుగమున దశరథ చక్రవర్తి పుత్రకాముడై యజ్ఞము సేయగోరి, యజ్ఞారంభ కాలమును ప్రశంసించినట్లుగా శ్రీ ఆండాళ్ దేవియు, తాము ప్రారంభించు వ్రత కాలమును 'మార్గళిత్తింగళ్' అని ప్రశంసించి, భావనా బలముచే, తానున్న శ్రీ విల్లిపుత్తూర్‌ను వ్రేపల్లెగను, అచటి అర్చనలందుచున్న "వటపత్రశాయి" ఆలయమును నందగోపునిభవనము గను, వటపత్రశాయిని నందగోపుల ముద్దుబిడ్డడు, సింగపు కొదమవంటి వాడును, నీల మేఘ శ్యాముడు, రక్తోత్పలాక్షుడు, పూర్ణ చంద్రబింబాననుడు, నారాయణుడైన శ్రీకృష్ణునిగను, అతడు తమకు వ్రతోపకరణమగు 'పర' నొసంగ మాట యిచ్చినట్లుగను, తనను గోపకుమారిగను, తన యీడు బాలికలను గోప బాలికలనుగ భావించి, స్నాన వ్రతము నాచరింప వారినందరిని రమ్మని పిలుచుటతో నీ తిరుప్పావు ప్రారంభ మగుచున్నది.

పెద్దల యనుమతితో వారు నడచిన మార్గముననే అనగా ధర్మ మార్గమున తామీ వ్రతము నాచరింతుమని, అందువలన నెలకు మూడు వానలు కురిసి, పాడిపంటలతో దేశము సుభిక్షము కాగలదని_ఈవ్రతాచరణ ఫలము తనకే కాక, తనకు సహకరించినవారికి, దేశీయులందరికి లభించవలెనను ఉదాత్తాశయము గలది గోదాదేవి. గోదా గోపకుమారి, తమ వ్రత నియమములను దెల్పుటను-'భావశ్రీ'గారి అనువాదమును బరిశీలింపుడు.

'ఈ లోకమందు నెంతే ముదంబందగా
ఉదయించినట్టి నవ్యోత్సాహులారా!
పాల సంద్రాన నెమ్మది మీఱ నిదురించు
పరమ పూరుషు పాద పద్మాల గీర్తించి
ఘృత దుగ్ధములను సేవింపకన్, వేకువన్
నీరాడి, కనుల కాటుక దిద్దగా బోము
కురుల పూల్ తురుమమే, గురులు సేయగ బోని

అన్నృత మాడము, పండితుల సత్కరించెదము
సన్యాసులకు భిక్షలం దృప్తి గూర్చెదము
ఇట్లింగి మేమాచరించు వ్రత రాజమ్ము
అరసి సంతోషమ్ము ననుభవింపగ రండు'

ఇట్లే 'మాయనై' అను పాశురానువాదమున

'.........యమునా నదీ తీర
వాసియై గోప కుల మణి దీపమయ్యెన్
గడగి తల్లి యశోద గర్భము ప్రకాశింప
జేయు దామోదరుని జేరగా వచ్చితిమి
పరిశుద్ధ భావనన్ పరిశుద్ధ పుష్పముల
అర్చించి, అంజలిన్ ఘటియించి, వాక్కునన్
కీర్తించి, మనసార ధ్యానించినంతనే
పూర్వ ఆగామి సంచిత పాపరాసులున్
వహ్నిలో దూదివలె భస్మమై నశియించు
అట్టి భగవన్నామ కీర్తనకు రారండి'

అర్చన, వందన, కీర్తన, స్మరణ రూపమైన భక్తి భావము న్యస్తము కాగా విశుద్ధ భావనతో "పతిం విశ్వస్యాత్మేశ్వరం" అన్నట్లు విశ్వపతి సమస్త జీవాత్మలకు ఈశ్వరుడగు భగవంతుని నిరతిశయ ప్రీతితో సేవించి, శ్రీ గోదాదేవి రాపత్రియోన్ముఁలకారియగు భగవదవగాహనమున శ్రీ రంగశాయి కృపకు పాత్రమయ్యెనను నీ గాథను శ్రీ "భావశ్రీ" గారు అసకృద్భావనమొనర్చి, భావము నవగాహనమొనర్చుకొని, పాఠకుల కత్యంత సులభ గ్రాహ్యమౌనట్లు అంధ్రీకరించి కృతకృత్యులై ఆంధ్రులకు మహోపకారమొనర్చినారు.

శ్రియఃపతి వీరికి ఆయురారోగ్య భాగ్యముల బ్రసాదించి, లోకోపకారకములగు పెక్కు కృతులను వీరి ద్వారా వెలయింపజేయ ప్రార్థించుచున్నాను.

"సరస్వతీ శ్రుతి మహతీ మహీయతామ్"

- ఇతిశమ్ -

# నివేదన

సమాజంలో నానాటికీ నాగరికత వెర్రితలలు వేస్తూన్న ఈ తరుణంలో హేతువాదంతో దైవభక్తి, పాపచింత అనే విషయాలను పట్టించుకోకుండా తిరిగే మనస్తత్వం అత్యధిక మానవులలో చోటుచేసుకోవడం కనిపిస్తోంది. మహాభారతంలో మార్కండేయుడు ధర్మరాజుకు చెప్పిన కలియుగ ధర్మాలలో 'తవిలి శరీరంబు తద్దయు బ్రోతురు పుణ్య ఫలంబులు బొంకులనుచు' అనే మాట ఈనాటి ప్రజలలో స్పష్టంగా ద్యోతకమౌతోంది. ప్రతి వ్యక్తి పరమార్థం కంటే స్వార్థానికి స్వాగతం పలుకుతూండడం గమనిస్తూనే వున్నాం.

మన వేదాలలోనూ, పురాణాలలోనూ, ఇతిహాసాలలోనూ ఈ శరీరం అశాశ్వతమని చెబుతూన్నా, ఆ మాటలను పెడచెవిని పెట్టి, శరీరమే శాశ్వతమని, దానిని భద్రంగా కాపాడుకోవాలనే ఆలోచనను నేటి మానవులు విడలేకపోతున్నారు. ఇటువంటివారు భగవంతునికి విముఖులుగా వుంటారు. యోగాభ్యాసంతో ఆత్మ స్వరూపాన్ని తెలుసుకొని, ఋషులు భగవంతునికి అభిముఖులుగా వుంటారు. దీనిని గాలికి వదిలేసి, కొందరు ఉదాసీనులుగా మిగిలిపోతారు.

భక్తిసాధనతో భగవంతుని సాన్నిధ్యం పొందాలనేది మార్గదర్శక సూత్రంగా కొందరు విజ్ఞులు ప్రవచిస్తారు. ఏది ఏమైనా పరిపక్వ పరిజ్ఞానం, సచ్ఛీలం, అవిరళమైన శ్రద్ధాసక్తులు ఆధారంగా సాధన లేదా యోగం కాదా భక్తి అవసరమనేది ఎవరూ కాదనజాలరు.

ఇది ఇలా వుండగా, భగవంతుడు తనకు అభిముఖులుగా, విముఖులుగా, ఉదాసీనులుగా వున్నవారిని సైతం తన కారుణ్యామృతవృష్టితో ఉద్ధరించే కళ్యాణ గుణ సంపన్నుడని గోదాదేవి దీనిలో వివరించడం విశేషం.

ఏ విధమైన ప్రయత్నం లేకుండానే, భగవంతుని అనుగ్రహంతో భగవదనుభవం పొందిన మహాభక్తులలో అగ్రగణ్యులు విష్ణుచిత్తులు, పెరియాళ్వారు. భగవానుడు అనుగ్రహించి, ఆ మహాభక్తునిచే పాండ్య

రాజు సభలో పరతత్త్వం శ్రీమన్నారాయణుడే అని నిరూపింపజేసిన సంఘటన భగవానుడెంత కరుణామయుడో, ఎంత భక్త సులభుడో తెలియజేస్తోంది. గనుకనే విష్ణుచిత్తులు ఆళ్వారులలో పెరియాళ్వారుగా స్థిరపడ్డారు. అయితే ఈ దివ్య ప్రబంధాన్ని రచించడంతో పెరియాళ్వారును మించిన ఘనత గోదాదేవికి దక్కింది.

పెరియాళ్వారు నామాంతరము గల విష్ణుచిత్తులు శ్రీ విల్లిపుత్తూరులో వేంచేసియున్న వటపత్రశాయికి నిత్యము పుష్పమాలతో కైంకర్యం చేసేవారు. వీరు కేవలము స్వామి కైంకర్యానికే అంకితమయ్యారు. ఒక రోజున తులసి వనంలో మొక్కలకు గొప్పు త్రవ్వుతూండగా, వీరికి ఒక బాలిక లభించింది. సంతానంలేని వీరు ఆ బాలికను గారాబంతో పెంచుకొంటూ, 'కోదై' (పూలదండ) పేరుతో పిలుచుకొంటూండేవారు. జన్మసిద్ధమైన వాసన గల తులసివలె ఈ బాలిక భక్తి, జ్ఞాన, వైరాగ్యాలతో భగవంతుని గుణగణాలయందే అనురక్తి, ఆసక్తి కలిగియుండేది. ఆమెకు యౌవనం ప్రాప్తించిన తర్వాత, శ్రీకృష్ణునే పెండ్లాడాలని ఆకాంక్షించి, విల్లిపుత్తూరులోని వటపత్రశాయిని వరించింది.

అనాదియైన మాయచేత నిద్రిస్తూన్న వారిని మేల్కొలిపి, తానయి భగవంతుడు తనను చూపగా, ఆళ్వారులు దర్శించారు. అలా కాకుండా తానే భగవంతుని మేల్కొలిపి, తనను గూర్చి తెలియజేసుకున్న మహనీయురాలు గోదాదేవి. ఆళ్వారులు స్త్రీత్వమైన భావనచే భగవంతుని నాయకునిగా ప్రేమించారు. గోదా సహజమైన స్త్రీమూర్తితో భగవానుని ప్రేమించింది. తన ప్రయత్నం సఫలం కాని కారణంగా, పూర్వమెవరైనా భగవంతుని ప్రేమించి, భర్తగా అనుభవించారా యని గోదాదేవి తెలిసికోవడం ప్రారంభించింది. గోపికలు పూర్వం కాత్యాయనీ వ్రతం చేసి, శ్రీకృష్ణుని తమ ప్రియునిగా అనుభవించారని గోదాదేవి తెలుసుకుంది.

ఒకనాడు రాసక్రీడలో నుండి, కృష్ణపరమాత్మ అంతర్హితుడయినాడు. గోపికలు కృష్ణుని గాంచలేక దుఃఖించి, తుదకు అతని లీలలను

అనుకరించి జీవించారని గోదా విన్నది. తానుకూడా అట్లు చేయవచ్చు ననుకొన్నది. ఫలితముగానే విల్లిపుత్తూరును నందవ్రజముగాను, తోడి చెలికత్తెలను గోపికలుగాను, వటపత్రశాయి ఆలయాన్ని నంద గోప భవనంగాను, తానును ఒక గోపికగాను గోదాదేవి భావించుకుంది.

మార్గశీర్ష స్నానము అను నోము సాధనగా తీసుకొని, భగవానునిదైన తన ఆత్మను సార్థకం చేసుకోవడానికి ఆ ప్రభువు సేవలుచేసే భాగ్యాన్ని ప్రసాదించమని ప్రార్థించింది.

ఇది ముప్పది రోజులు నిర్వహించిన వ్రతం. ప్రతి నిత్యం పది మంది గోపికలను మేల్కొలుపుకొంటూ రోజునకొక పాశురం (గీతం) వంతున ముప్పది పాశురాలను గోదాదేవి రచించింది.

ఈ వ్రతంలో నందగోపుని భవనానికి వెళ్ళి, నందగోపుని, యశోదను, బలరాముని, చివరికి శ్రీకృష్ణుని, నీలాదేవిని మేల్కొలిపి, గోపికలు శ్రీకృష్ణునికి తమ కోరికను నివేదించుకున్నారు. తాము ఆత్మ వున్నంతకాలం అతనితో కలిసి వుండి, సేవించే భాగ్యాన్ని పొందగలిగాను రెండవ పాశురం (గీతం)లో 'పరమ పూజ్యమ పాద పద్మాల గిర్తించి'తో ఆరంభించి, ముప్పదవ పాశురం (గీతం)లో 'కేశవుని మహిమమైె నుతియించి'తో గోపికలు వ్రతాన్ని పూర్తి చేయడంవల్ల పాదము మొదలు కేశముల వరకు శ్రీకృష్ణుని వారు అనుభవించారని భావించవచ్చు.

ఈ దివ్య ప్రబంధాన్నే 'తిరుప్పావై' అని వ్యవహరిస్తారు. అలానే ఈ వ్రతాన్ని శ్రీవ్రతం అని కూడా అంటారు. దీనికి కారణం తిరు = శ్రీ, పావై = వ్రతము అని కదా అర్థం. అంటే ఇహలోక సంబంధమైన మరియు పరలోక సంబంధమైన ఐశ్వర్యాలను, కైంకర్యాన్నీ ఈ వ్రతం ప్రసాదిస్తుంది, అన్నమాట. గనకనే గోదాదేవి ఈవ్రతాన్ని చేసి, గోపికలు పొందిన ఫలితాన్ని తాను పొందగలిగింది. ఈ గీతాలను క్రమం తప్పకుండా అభ్యాసం చేసిన వారికి తాను వ్రతాన్ని ఆచరించి పొందిన ఫలాన్ని ప్రాప్తింపజేయాలని కూడా గోదామాత శాసించింది.

ఇటువంటి మహత్తరమైన దివ్య ప్రబంధాన్ని సర్వ జనులకూ సులభంగా అర్ధమయ్యే రీతిలో తెలుగులోకి స్వేచ్ఛానువాదం చేసి, 'గోదా గీతమాలిక'గా సమర్పించుకొంటున్నాను.

శ్రీ వేంకటేశ్వరుని కరుణా కటాక్షాలతో చేసిన నా ప్రయత్నం సామాన్య ప్రజానీకానికి ఏ మాత్రం మార్గదర్శకమైనా, నా జీవితం ధన్యమైనట్లుగానే భావిస్తాను.

ఈ నా ప్రయత్నాన్ని కారుణ్యామృత దృష్టితో అభినందించి, మంగళాశాసనాన్ని ప్రసాదించి, నన్నాశీర్వదించిన పూజ్య పాదులు, శ్రీమాన్, త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి వారికి నా కృతజ్ఞతాభివందన సహస్రములు. కోరినదే తడవుగా తమ అమూల్యాభిప్రాయాన్ని అందించి, ప్రోత్సహించిన పూజ్యులు, శ్రీకాకుళం ఉపనిషన్మందిరం కార్యదర్శి, ప్రముఖ సంస్కృత పండితులు, భాషా ప్రవీణులు, శ్రీమాన్, అరవెల్లి లక్ష్మీనారాయణాచార్యుల వారికి నా హార్దికాభివందనములు.

ఈ 'గోదా గీత మాలిక'కు అక్షర రూపాన్ని ప్రసాదించడానికి ఆర్ధిక సహాయాన్ని అందించి సహకరించిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికి నా నమోవాకాలు.

దీనిని సర్వాంగ సుందరంగా ముద్రించి, అందించడంలో శ్రద్ధ వహించిన ప్రియ మిత్రులు, నవలా రచయిత, వేగుచుక్క పవర్ ప్రింటింగు వర్క్సు, అధినేత, శ్రీ గంధవరప్పు వేంకటరావుగారికీ, ముఖ పత్ర చిత్ర రూపశిల్పిగా సహకరించిన యువ చిత్రకారులు, శ్రీ వంజరాపు శంకరరావుగారికీ నా అభివాదములు. ప్రత్యక్షంగానూ, పరోక్షంగానూ ముద్రణలో ఎంతో బాధ్యత వహించిన ప్రెస్ కార్మిక సోదరులకు నా శుభాభినందనలు.

దీని ప్రచురణలో సహకరించిన మిత్రులు, శ్రేయోభిలాషులు ఎందరో! అందరికీ అభివందనములు.

—భావశ్రీ.

# అంకితం



కలియుగ మందు భక్తులకు

కల్పకమై, తమ కష్ట బాధలన్

పొలియగఁ జేసి, సౌఖ్యముల

పూర్ణ దయారస వృష్టిఁ గూర్చి, మేల్

జిలుకగ భోగ భాగ్యము ల

శేష గతిం బవరించి, పిల్చినన్

పలికెడు శ్రీనివాస! నిను

భక్తిమెయి న్నుతియింతు నిత్యమున్.

వాచవు లూరు నాంధ్రమున

వ్రాయస కానిగ జేసి, నా మదిన్

రోచిసుదాత్త తత్త్వము ని

రూఢ గతిన్ ఘటియించి, శ్రద్ధ ప్రే

రేచిన నీ కృపన్ పొడమె

నీ కృతి, భక్తి విశేషతన్ భవత్

శ్రీ చరణాంబుజమ్ములఁ

జేర్చితి జన్మము సార్థకమ్ముగాన్.

—భావశ్రీ.

# ప్రావృత్తి

[అది 1996 జనవరి 10వ తేదీ. నేను శ్రీతిరుమల వేంకటేశ్వరుని పాద పద్మాలను దర్శించిన శుభతరుణం. ఆ క్షణంలో స్వామి సన్నిధిలో నా మనస్సులో తళుక్కున మెరసిన చైతన్య రేఖయే ఈ కృతికి నన్ను ప్రేరేపించింది.]

అది నా జీవిత మార్గదర్శియయి, విద్యాగంధ సార్థక్యతన్
మదికిన్ కూర్చిన పుణ్యకాలము ; ననున్ మాన్యస్థితిన్ సత్ప్రథా
వృతు గావించిన పుష్కరాంక ; కవితా ప్రాగల్భ్యమౌ చిత్తమున్
వదిలన్నా గతి నిల్పు కొమ్మనెడు దివ్యమ్మైన సందేశమౌ.

శ్రీ శేషాచల శ్రీనివాస పదముల్ సేవించి, భావింప నా
వేశమ్ముల్ నశియించి నిశ్చలత పర్వెన్ ; లోన నిర్లిప్తమౌ
ధ్యానన్నిల్చిన దివ్య భావన సముద్యస్ఫూర్తి దీపింపగా
రాశీభూత ప్రబోధ శీలమది సోరాడంగ నూకొల్పుటన్

అర్ధ నిమీలితేక్షణములన్ శయించిన దివ్య భావన
ర్వార్థము నా హృదంతరము నందు గుబుల్కొని నాదు జన్మమున్
సార్థక మౌనటుల్ పరమ జాగృత కేలల కృష్ణతత్త్వ బో
ధార్థక కందమున్ పరకమౌనటు తీర్చగ తెమ్ము తెమ్మనన్.

'ఇప్పుడే దీక్ష వహించినాడను ప్రభూ! ఈ దీక్ష సాఫల్యమౌ
కృప నాపై సేయఁగదయ్య ; వేంకటపతీ! కీర్తింపగా దివ్య భా
వపు మేల్బంతిగ నాంధ్రమందున 'తిరుప్పావు'న్ రచింతునే ; మరే
జపముల్ పూజలొనర్పనైతిని భవత్ సాన్నిధ్యమందెన్నడేన్.

....అని పూనిన నా దీక్షకు స్వామి అనుగ్రహం రక్షగా అనతి కాలం లోనే 'గోదా గీతమాలిక' ఆవిర్భవించింది.

—భావశ్రీ.

# గోదా గీత మాలిక.



సన్నివేశము : తమకు అనుకూలమైన కాలము లభించినది. గనుక, ఈ సమయముననే గోపికలు తామీ వ్రతము నాచరించి, పొందదగు సాధనమేమో వ్యక్తము చేయుట:

## పాశురము-1

మార్గళిత్తింగళ్ మది నిఱైన్ద నన్నాళాల్
నీరాడప్పోదువీర్ పోదుమినో నేరిళైయీర్!
శీర్‌మల్‌గుమయ్ ప్పాడి చ్చెల్వ చ్చిఱుమీర్‌కాళ్!
కూర్‌వేల్ - కొడున్దొళిలన్ నన్దగోపన్ కుమరన్
ఏరార్‌న్ద కణ్ణి యశోదై యిళఞ్జిఙ్గమ్
కార్ మేని చ్చెంగణ్ కదిర్ మదియమ్బోల్ ముగత్తాన్
నారాయణనే నమక్కే పఱైదరువాన్
పారోర్ పుగళప్పడిన్దేలో రెమ్బావాయ్!

## గీతము-1

సిరులుప్పతిల్లు వ్రేపల్లెలో నగలతో
వగల రాజిల్లు జవ్వనులార రారే!
మార్గశీర్షమున పున్నమ చందమామతో
మా మంచి రోజు రానే వచ్చె నేడే,
వేలాయుధమున తావెన్ను నిన్ సేవించు
నంద గోపులకు తా నందనుండై యొప్పు

అందాల కనులతో అల యశోదాదేవి
గారాబు బాల సింగము శ్యామలాంగుండు
కెందమ్మి కనుల రక్తిన్ ప్రకాశాహ్లాద
ములనిచ్చు ముఖ మండలుండు నారాయణుడు
మన వాంఛ తీరగా పరమ 'పర' సాధనము
రహి గూర్చు నీరాడు వ్రతముకై రారండు!

## భావము :

సకల సంపదలతో కూడిన వ్రేపల్లెలో అందమైన నగలతో విలాస వతులైన పడుచులారా! మార్గశీర్ష పూర్ణిమయైన ఈ రోజు చాల మంచి రోజు. వేలాయుధము ధరించి, కృష్ణుని సేవించు నందగోపుల కుమారుడును, అందాల కనులతో అలరారు యశోదాదేవియొక్క సింహ కిశోరమును, శ్యామల వర్ణము గలవాడును, ఎర్రతామరల బోలు కన్నుల యందు సూర్యుని ప్రకాశమును, చంద్రుని ఆహ్లాదమును ప్రసాదించు ముఖమండలుడైన నారాయణుడు మన మపేక్షించు పవిత్రమైన పర సాధనమును సమకూర్చునట్టి స్నానమాచరించెడు ఈ వ్రతమునకై మీరు సిద్ధమై రండు.

## విశేషాంశములు :

భగవంతుని తత్త్వము ఐదు రూపములు. అవి పర, వ్యూహ, విభవ, అంతర్యామి, అర్చా రూపములు. సత్యజ్ఞానానంద స్వరూపమై, సచ్ఛబ్దవాచ్యమై కారణభూతమగు శ్రీమన్నారాయణుడే పరబ్రహ్మము. అదియే పరతత్త్వము. పరతత్త్వమును పొందదగు సాధనమే 'పర'సాధనము. మార్గశీర్షము అనగా భగవంతుని పొందుటకు శ్రేష్ఠమైన మార్గము. అదియు భగవంతుని స్వరూపమే. ఆ మార్గమును భగవంతుడే తానయి చూపును. నీరాడుట : భగవంతుని పొందుటకై అనుభవించు తాపమును శాంతింపజేయుటకు, అనగా సహానుభూతి పొందుటకని ఆకాంక్షింపబడెను.

సన్నివేశము : ఈ వ్రతము చేయుటలో వారి ఆకాంక్ష, దానికి పొందదగిన సహకారము, ఈ వ్రతమును ఆచరించుటకు తమకు గల అర్హత వివరించబడుటు. వ్రతము ఆచరించుటలో చేయుదగిన పనులేవి? చేయుదగని పనులేవియో స్పష్టము చేయబడుటు.

## పాశురము-2

వైయత్తు వాళ్ వీర్గాళ్! నాముమ్ నమ్బావైక్కు
చ్చెయ్యుమ్గిరిశైగళ్ కేళీరో, పాఱ్కడలుళ్
పైయత్తుయిన్ర పరమ నడిపాడి
నెయ్యుణ్ణోమ్ పాలుణ్ణోమ్ నాట్కాలే నీరాడి
మైయిట్టెళుదోమ్ మలరిట్టునామ్ ముడియోమ్
శెయ్యాదన శెయ్యోమ్ తీక్కుఱళై చ్చెన్రోదోమ్
ఐయముమ్ పిచ్చైయుమ్ ఆన్దనైయుమ్ కైకాట్టి
ఉయ్యుమా ఱెణ్ణి యుగన్దేలో రెమ్బావాయ్.

## గీతము-2

ఈ లోకమందు నెంతే ముదంబందగా
ఉదయించినట్టి సద్వ్రతాసక్తులారా!
పాలసంద్రాశ్రిన నెమ్మది మీఱ నిదురించు
పరమ పూరుషు పాదపద్మాల గీర్తించి
ఘృత దుగ్ధములను సేవింపకన్, వేకువన్
నీరాడి కనుల కాటుక దిద్దగా బోము;
కురుల పూల్ తురుమమే, గురులు చేయగ బోని
పనులు చేయము - దూషణలు పలుకగాబోము

అనృత మాడము – పండితుల సత్కరించెదము
సన్యాసులకు భిక్షలం దృప్తి గూర్చెదము
ఇట్లుంగి మేమాచరించు వ్రతరాజమ్ము
అరసి సంతోషమ్ము ననుభవింపగ రండు!

## భావము :

ఈ లోకమునందు ఆనందమును అనుభవించుటకు జన్మించిన వ్యక్తులారా! పాల సముద్రమున నెమ్మదిగా నిదురించియున్న పరమ పురుషుని పాదపద్మాలను గీర్తించి, మేము నేతిని గాని, పాలను గాని సేవింపము. వేకువనే స్నానము చేసి, కన్నులకు కాటుక దిద్దము. కొప్పులో పూలు ముడుచుకోము. పెద్దలు ఆచరించని కార్యములను ఆచరించము. ఒరులను దూషించము. అసత్యము పలుకము జ్ఞానవంతులైన పండితులను సత్కరించెదము. సన్యాసులను భిక్షలచే తృప్తి పరచెదము. ఈ విధముగా మేము ఆచరించు వ్రతమును చూచి, మీరును ఆనందింపగోరి మాతో రండి!

## విశేషాంశములు :

1. ఈ వ్రతమాచరించువారు చేయవలసినవి, చేయరానివి తమతో వ్రతమును ఆచరింప వచ్చెడి గోపికలకు వివరించబడినది. 2. కృష్ణానుభవము వలన లభించు శాశ్వతమైన ఆనందమును అనుభవించుటకు గోపికలుగా జన్మించిరి. 3. నేతిని, పాలను సేవింపమని చెప్పుటలో భగవదనుభవము పొందినప్పుడు లౌకిక భోగములు అపేక్షించు అవసరముండదని భావము. 4. అసత్యము పలుకకుండుటలో సత్యనిష్ఠ ఆచరించుట కనిపించును.

సన్నివేశము : బాహ్యముగ వర్షము కొరకు నీవ్రతము నాచరించు చున్నట్లు కనిపించినను, శ్రీకృష్ణ సమాగమము వలన గోపికల విరహతాపము శాంతిబొందుటకై స్నానమును అంగముగా గైకొనబడుట ఆంతర్యము.

## పాశురము-3

ఓఙ్గియుల గళన్ద ఉత్తమన్ పేర్పాడి
నాఙ్గళ్ నంబావైక్కు చ్చాత్తి నీరాడినాల్
తీఙ్గిన్రి నాడెల్లామ్ తిఙ్గళ్ ముమ్మారి పెయ్దు
ఓఙ్గు పెరుఞ్జెన్నెల్ ఊడు కయలు గళ
పూఙ్గు వళై ప్పోదిల్ పొఱి వండు కణ్ పడుప్ప
తేఙ్గాదే పుక్కిరున్దు శీర్త్తములై పత్తి
వాఙ్గక్కుడమ్ నిఱైక్కుమ్ వళ్ళల్ పెరుమ్ పశుక్కళ్
నీఙ్గాద శెల్వమ్ నిఱైన్దేలో రెమ్బావాయ్.

## గీతము-3

బలి చక్రవర్తి దానమునంది, ఆకాశ
మంటుగా పెరిగి లోకముల గాపాడిన
పురుషోత్తముని నామముల కీర్తనము జేసి,
వ్రత దీక్ష మిషను మేమెల్లరము నీరాడ
ఈతి బాధలు లేక నెలకు వానలు మూడు
వర్షింప వర్ధిల్లు వరిచేల మధ్యమున
త్రుళ్ళిపడగా చేపలెల్ల, కలువలలోన
తుమ్మెదలు నిదురింప దొడరు సమయమునందు
పసుల కొట్టములోన పాడి గోవులబట్టి

పొదుగంటుగనె పాలు భోరునన్ ప్రవహించ
పాడిపంటలు సర్వసమృద్ధమై యుండ
నిత్యమౌ సంపదలు నెసగు గావున రండు!

## భావము :

బలి చక్రవర్తి యిచ్చిన దానమును పొంది ఆకసము వరకు పెరిగి, లోకములను కాపాడిన పురుషోత్తముడైన శ్రీమన్నారాయణుని నామములను గానము చేసి, వ్రత దీక్ష నెపముతో మేము స్నానము చేయుచున్నాము. దీనివలన లోకమున నెలకు మూడు వానలు కురిసి, ఈతి బాధలు లేకుండును. ఫలితముగా వృద్ధి పొందిన వరిచేల నడుమ చేపలు త్రుళ్ళిపడుచుండును. కలువ పూవులలో తుమ్మెదలు నిదురించును. ఆ సమయమున పాలు తీయుటకై పశువుల శాలలలో నున్న పాడియావుల పొదుగులంటగనే భోరున పాలు ప్రవహించును. పాడి పంటలు సమృద్ధి చెంది, ఈ లోకమున శాశ్వతమైన సంపదలు వర్ధిల్లును. కాబట్టి మీరు కూడా మాతో రండి!

## విశేషాంశములు :

1. ఈతి బాధలు 6 విధములు. అతివృష్టి, అనావృష్టి, ఎలుకలు, చిలుకలు, మిడుతలు, క్రూరులగు రాజుల వలన కలుగు బాధలివి.
2. నెలకు మూడు వర్షములు ; బ్రాహ్మణులు విధులు నిర్వర్తించుట, ప్రభువులు సరిగా పాలించుట, స్త్రీలు పాతివ్రత్యము పాటించుట అను మూడు కారణముల వలననే నెలకు మూడు వర్షములు కురియును వీటిలో ఏది లోపించినను, ఫలమునందు ఆ లోపము కనిపించును.

సన్నివేశము : గోపికలు ఆచరించు వ్రతమునందు స్నానము ప్రధానము. గనుక స్నానమునకు జలము సమృద్ధిగ నుండవలెను. అట్టి జలమును పొందుటకు భగవంతునే ఆశ్రయించి, అతని రూపమును బోలిన పర్జన్యుని ప్రార్థించుట.

## పాశురము-4

ఆళి మళైక్కణ్ణా! ఒన్ఱు నీకై కరవేల్
ఆళియుళ్ పుక్కు ముగన్దు కొడార్త్తేఱి
ఊళి ముదల్వ నురువమ్ పోల్-మెయ్ కఱుత్తు
పాళి యన్దోళుడై ప్పఱ్పనాబన్ కైయిల్
ఆళి పోల్ మిన్ని వలమ్బురి పోల్ నిన్ఱదిర్న్దు
తాళాదే శార్ఙ్గ ముదైత్త శరమళై పోల్
వాళ వులగినిల్ పెయ్దిడాయ్ - నాఙ్గళుమ్
మార్గళి నీరాడ మగళ్న్దేలో రెమ్బావాయ్.

## గీతము-4

వర్ష నిర్వాహకా! గంభీర భావుకా!
నీ త్యాగమందు సంకోచింప వలదయ్య!
జలధి మధ్యను జొచ్చి, జలమంతటిని బీల్చి,
గర్జించి గర్జించి గగన మధిరోహించి,
కాలాది సకల కారణ భూతుడైనట్టి
నారాయణుని దివ్య శ్యామలా కృతి తోడ
అదుడైన అతని సుందర బాహుయుగ్మమున
చక్రమ్ము వలె మెరసి, శంఖమ్ము వలె ఉరిమి

శార్ఙ్గమ్ము గురియించు శరవర్షమన్నట్లు
లోకమెల్ల సుఖింప మేము సంతోషాన
మార్గశీర్ష స్నాన మాచరించెదునట్లు
ఆలసింపక వర్ష మందింప గోరెదము.

## భావము :

వర్షమును నిర్వహించు గంభీర స్వభావముగల ఓ పర్జన్యుడా! నీ త్యాగ గుణమునందు జంకబోకుము. జలరాశి మధ్యను ప్రవేశించి, నీటిని పీల్చుకొని, గొప్పగా గర్జించుచు, ఆకాశమునకు పోయి: కాలాది సకల పదార్థములకు కారణభూతుడైన నారాయణునియొక్క దివ్య శ్యామల వర్ణ రూపముతో అతని కుడిచేతియందలి చక్రము వలె ప్రకాశించియు, ఎడమ చేతియందలి శంఖము వలె గర్జించియు, శార్ఙ్గమను అతని ధనుస్సునుండి కురిసిన బాణముల వర్షమను విధముగా లోకులు సుఖించునట్లుగను, మేము ఆనందముతో మార్గశీర్ష స్నానము చేయునట్లుగను వర్షింపుము.

## విశేషాంశములు :

నారాయణుడొక శ్రుతి సాగరము. అటువంటి సముద్రమున మునిగి, వర్షము నిచ్చువాడు మేఘుడు. ఆ మేఘునియందు ఆచార్యుని దర్శించి, గోపికలు భగవత్కారుణ్య రసవృష్టి నిమ్మని అభ్యర్థించు చున్నారు.



సన్నివేశము : భగవంతుని పరిశుద్ధ భావనతోడను, పరిశుద్ధ పుష్పముల తోడను పూజించి, చేతులు జోడించి, నమస్కరించి, కీర్తించి, ధ్యానించి, పూర్వ ఆగామి పాపములనుండి గోపికలు విముక్తి పొందుటకు సిద్ధమొనర్చుట.

## పాశురము-5

మాయనై మన్ను వడమదురై మైన్దనై
త్తూయ పెరునీర్ యమునై త్తుఱై వనై
ఆయర్ కులత్తినిల్ తోన్ఱుమ్ మణి విళక్కై
త్తాయైక్కుడల్ విళక్కమ్ శెయ్‌త దామోదరనై
తూ యో మాయ్ వన్దునామ్ తూమలర్ తూవిత్తొళుతు
వాయినాల్ పాడి మనత్తినాల్ శిన్దిక్క
ప్పోయ పిళైయుమ్ పుగు దరువా నిన్ఱనవుమ్
తీయినిల్ తూశాగుమ్ శెప్పేలో రెమ్బావాయ్.

## గీతము-5

ఆశ్చర్య చేష్టితుడు అనవరత భాగవత
మధురాధి నాయకుడు పరిశుద్ధ జలములన్
అతి అగాధంబైన యమునా నదీ తీర
వాసియై గోప కుల మణి దీపమయ్యున్
గడగి తల్లి యశోద గర్భము ప్రకాశింప
జేయు దామోదరుని జేరగా వచ్చితిమి;
పరిశుద్ధ భావనన్ పరిశుద్ధ పుష్పముల
అర్చించి, అంజలిన్ ఘటియించి, వాక్కునన్

కీర్తించి, మనసార ధ్యానించి నంతనే
పూర్వ ఆగామి సంచిత పాప రాసులున్
వహ్నిలో దూదివలె భస్మమై నశియించు
అట్టి భగవన్నామ కీర్తనకు రారండి!

## భావము :

ఆశ్చర్యకరములగు చేష్టలు చేయువాడును, నిరంతరము భగవద్భక్తి గల మధురా నగరమునకు అధిపతియు, అతి అగాధమైన పవిత్ర యమునా నదీ తీరమున గలవాడును, గోప వంశమునకు మణిదీపమైన వాడును, తల్లియగు యశోద గర్భమును ప్రకాశింపజేయు దామోదరుడగు శ్రీకృష్ణునియొద్దకు వచ్చితిమి. పరిశుద్ధ భావనతో, పరిశుద్ధ పుష్పములతో పూజించి, చేతులు జోడించి నమస్కరించి, భాషచే కీర్తనముచేసి, మనసార ధ్యానించినంతనే పూర్వ ఆగామి సంచిత పాపరాసులు అగ్నిలో పడిన దూదివలె భస్మమై నశించును. కాబట్టి, అట్టి భగవన్నామములను పాడుకొనుటకు సిద్ధముగా రండి.

## విశేషాంశములు :

భగవద్భక్తి ఆశ్చర్యకరమైనది. అది వాక్కులకు, మనస్సునకు అందనిది. ఈ పవిత్రము బాహ్యమునకు స్నానమాచరించునట్టి పవిత్రము. ఆంతరమున భగవంతునితో అనుభవము పొందుటకు అవగాహనము (జ్ఞానము—స్నానము అను అర్థములు సూచించునది) నకై చేయునట్టి పవిత్రము. భగవంతుని సన్నిధిలో ఆతని సేవ చేయుటయే వీరి ఆకాంక్ష



సన్నివేశము : శ్రీకృష్ణునితో సంశ్లేషానుభవమును ఇంతకు పూర్వము ఎఱుగక, ఇప్పుడు కొత్తగా అనుభవించి, సుఖాను భూతితో మేలుకొనలేక లోపలనే పరున్న ఒక గోపికను లేపుచున్నారు.

## పాశురము - 6

పుళ్ళుమ్ శిలుమ్బిన కాణ్ పుళ్ళరైయన్ కోయిలిల్
వెళ్ళై విళిశఙ్గిన్ పేరరవమ్ కేట్టిలైయో
పిళ్ళాయ్! ఎళున్దిరాయ్ పేయ్ ములైనఞ్జుణ్డు
కళ్ళచ్చగడమ్ కలక్కళి యక్కాలోచ్చి
వెళ్ళత్తరవిల్ తుయిల మర్న్ద విత్తినై
ఉళ్ళత్తు క్కొణ్డు మునివర్ గళుమ్ యోగి గళుమ్
మెళ్ళ వెళున్దు అరియెన్ఱ పేర రవమ్
ఉళ్ళమ్ పుగున్దు కుళిర్న్దేలో రెమ్బావాయ్.

## గీతము - 6

కూయగా సాగె పక్షులు — వైనతేయునిన్
పిల్చె గుడిలో పాంచజన్యమ్ము మ్రోతతో
విని పించనే లేదా? మేలుకోగదవమ్మ!
అసుర పూతన విసపుఁబాలారగించి తా
శకటాసురుని తాచి, నంధులన్ హరియించి
పాల్కడలి శేష శయ్యను యోగ నిద్రతో
రహి మీర లోక కారణ భూతునిన్ భక్తి
మునులు యోగులు భద్రమొనరించి హృదయాన

హరి హరీ యను నామస్మరణ దిక్కులు నిండు
ధ్వని తోడ మా హృదంతరములన్ నిండారి
మము చల్ల బరచి మేల్కొలిపి వైచినదంత
భవనాన నిదురించు పడతి మేల్కొనవమ్మ

## భావము :

పక్షులు కూయసాగినవి. విష్ణ్వాలయములోని పాంచజన్యము గొప్ప మ్రోతతో గరుత్మంతుని పిల్చుచున్నది. ఆ ధ్వని నీకు వినిపించ లేదా? ఓ పడతీ! నీవు మేల్కొనుము. పూతన విషదుగ్ధము లారగించి, శకటాసురుని సంధులూడగొట్టి పాలసముద్రమున శేషశయ్యపై యోగ నిద్రలోనున్న లోకములకు కారణభూతుడైన సర్వేశ్వరుని తమ హృదయములలో భద్రమొనర్చుకున్న మునీశ్వరులు, యోగీశ్వరులు దిక్కులు నిండునట్లు హరి హరీయని చేయు నామస్మరణ మా హృదయ ములలో ప్రవేశించి మమ్ములను మేల్కొలిపినవి. భవనములో నిదురించి యున్న నీవు కూడ మేల్కొనుము.

## విశేషాంశములు :

గోపికలందరు కృష్ణునితో కలిసి, తాము వ్రతము చేయుటకు పెద్దలు అంగీకరించుటతో రాత్రి ఆనందముతో నుండిరి. తెల్లవారు జామున వ్రతమాచరించుటకు బయలుదేరి నిద్రలోనున్న గోపికలను మేల్కొలుపుచున్నారు.



సన్ని వేశము : భక్తికి మొదటి లక్షణము శ్రవణము. గనక నే'విన లేదా?' 'వినియే పకుంటివా?' అన్న ప్రశ్నలతో బాటు పక్షుల కూతలు, శంఖ ధ్వని, హరి హరీ యన్న నామస్మరణము అనునవి హృదయమున సంస్కారము కలిగించుననిచేసెడి ప్రయత్నము.

# పాశురము - 7

కీశు కీశెన్ఱెఙ్గుమానైచ్చాత్తన్ గలన్దు
పేశిన పేచ్చరవమ్ కేట్టిలైయో పేయ్ప్పెణ్ణే!
కాశుమ్ పిఱప్పుమ్ కలగలప్పక్కై పేర్త్తు
వాశ నఱుఙ్గుళలాయ్ చ్చియర్ ; మత్తినాల్
ఓశైప్పడుత్త యిర రవమ్ కేట్టిలైయో
నాయకప్పెణ్పిళ్ళాయ్! నారాయణన్ మూర్త్తి
కేశవనై ప్పాడవుమ్ నీకేట్టే కిడత్తియో
తేశముడై యాయ్! తిఱవేలో రెమ్బావాయ్.

# గీతము - 7

ఏటిరింత లొండొంటు కీచు కీచున నెవో
మాటాడు ధ్వను లొక్కమారు విన లేదా?
ఓ పిచ్చి పిల్ల! వేనలి వాసనల జిమ్మ
గొల్ల బొట్లెలు కవ్వముల పెరుగు చిల్కగా
వారి కంకణ ధ్వనులు కంఠ హార ధ్వనులు
మిన్ను ముట్టగ నీవు విన లేదొ నాయికా!

అన్నింట బాహ్యాంతరములంతు వ్యాపించి
కృష్ణాకృతిని కేశి రక్కసుని వధియించి
గెరలు సర్వేశ్వరుని కీర్తింపగా మేము
తేజస్వినీ! నీవు వినియే పరుంటివా?
ఆ దివ్య తేజస్సు అనుభవింపగ మేము
ఆలస్య మొనరింపకయె తలుపు తెరువుమా!

## భావము :

ఏట్రింతలు ఒకదానితో వేరొకటి కలిసి, కీచు కీచు మంటూ ఏవో మాటలాడుకొనుచున్నవి. ఆ మాటల ధ్వని నీవు వినలేదా? ఓ పిచ్చి పిల్లా! కొప్పు నందలి పూల వాసనలు వెదజల్లుచున్న గొల్ల బొట్టెలు కవ్వములతో పెరుగు చిలుకునప్పుడు వారి కంకణముల యొక్కయు మరియు కంఠహారముల యొక్కయు ధ్వనులు మిన్ను ముట్టగా నీవు వినలేదా? అన్నిటియందు లోపల, బయట వ్యాపించి, కృష్ణుని ఆకారముతో కేశి యను రాక్షసుని చంపిన సర్వేశ్వరుని మేము కీర్తించు చుండగా తేజస్వినివైన నీవు వినియే పరుంటివా? ఆ దివ్య తేజస్సును మేము అనుభవించుటకు వెంటనే తలుపు తెరువుము.

## విశేషాంశములు :

భరద్వాజుడు మూడు వేదములు అధ్యయనము చేయుటకు మూడు వందల సంవత్సరములు జీవించెను. అయినను, వాటిలో ఒక దానిని కూడ తెలిసికొనలేక పోయెను. అయినను జిజ్ఞాస విడువలేదు. వేదాధ్యయనమునకై తమ జీవితమునంతను వినియోగించినవే భరద్వాజ పక్షులు. భరద్వాజము అనగా ఏట్రింత.

సన్నివేశము : పిల్లలను తమతో తీసుకొని, నిద్రపోవుచున్న గోపికను మేల్కొలుపుటకు బయలుదేరుట. ఆవిధముగా శ్రీ కృష్ణుని కీర్తించి "పర" సాధనమును పొందుటకు ప్రయత్నించుట.

## పాశురము-8

కీళ్ వానమ్ వెళ్ళెన్రు ఎరుమై శిఱు వీడు
మేయ్ వాన్ పరన్దన కాణ్! మిక్కుళ్ళ పిళ్ళైగళుమ్
పోవాన్ పోగిన్రారై ప్పోగామల్ కాత్తు న్నై
కూవువాన్ వన్దు నిన్రోమ్; కోదు కల ముడైయ
పావాయ్; ఎళున్దిరాయ్, పాడి ప్పఱై కొణ్డు
మావాయ్ పిళన్దానై మల్లరై మాట్టియ
దేవాది దేవనై చ్చెన్రు నామ్ శేవిత్తాల్
ఆవా వెన్రా రాయ్న్దు అరుళేలో రెమ్బావాయ్.

## గీతము-8

తెలవారు చుండె తూరుపు దిక్కు; చిరు బీడు
నందు మేయగ గేదెలవి పోవు చుండెనే
పిల్లలందరు వ్రిత స్థలమునకు బోవుచో
వారి గైకొని యిటకు వచ్చితిమి నిను బిల్వ
లేచి రావమ్మ! కీర్తించి కృష్ణుని మనము
వ్రితమునకు సాధనమ్మౌ పరము వేబొంది
మల్లురం దునుమాడి, కేశి సూదనుడైన
దేవాది దేవు సేవించి ప్రార్థించినన్

మన బాధలన్ విచారించి కరుణామయుడు
తన కటాక్షాను భూతిని గాచు కారమ్ము!

## భావము :

తూరుపు దిక్కు తెల్లవారుచున్నది. చిన్న బీడులో మేయుటకు గేదెలు పోవుచున్నవి. వ్రతస్థలమునకు పోవుచున్న పిల్లలను తీసుకొని, నిన్ను పిలుచుటకు ఇచ్చటకు వచ్చితిమి. నీవు లేచి రమ్ము! శ్రీకృష్ణుని మనము కీర్తించి, వ్రతమునకు సాధనమైన 'పర'ను పొంది, కేశి అను రాక్షసుని పరిమార్చి, మల్లయోధులైన చాణూర, ముష్టికులను తునుమాడి, దేవతలకు ఆదిదేవుడైన మహావిష్ణువును సేవించి, ప్రార్థించినచో, కరుణామయుడై మన బాధలను విచారించి, మనలను కటాక్షించును.

## విశేషాంశములు :

రాజస, తామస భావములు తగ్గుటకు మనస్సునందు సత్త్వ గుణము ఉదయించుటయే తూరుపు తెల్లబడుట. కృష్ణ సంశ్లేషము, కృష్ణానుభవము అయిన రాత్రి తెల్లవారినచో రాజసులగు గొల్లపెద్దలు తమకు అడ్డు పడెదరని, తెల్లవారక ముందే కృష్ణ సంశ్లేషము పొందవలెనని గోపికను మేల్కొలుపుచున్నారు.



సన్నివేశము. ముగ్గురు గోపికలను మేల్కొలిపిన పిమ్మట నాల్గవ గోపికను మేల్కొలుపుచున్నారు. మొదటి రెండు పాశురములందు శ్రవణము, తర్వాత పాశురమున మననమును, ఈ పాశురమునుండి నాలుగు పాశురములలో ధ్యానమును వివరింపబడినది ధ్యానములో నిష్ఠమైన గోపికను నేడు మేల్కొలుపుట.

## పాశురము-9

తూమణి మాడత్తు చ్చుత్తుమ్ విళక్కెరియ
తూపమ్ కమళ త్తుయిలణై మేల్ కణ్ వళరుమ్
మామాన్ మగళే! మణి క్కదవమ్ తాళ్ తిఱవాయ్
మామీర్! అవళై యెళుప్పీరో! ఉన్ మగళ్ దాన్
ఊమైయో? అన్ఱిచ్చెవిడో? అనన్దలో
ఏమప్పెరున్దుయిల్ మన్దిరప్పట్టాళో?
"మామాయన్, మాదవన్, వైగున్దన్" ఎన్ఱెన్ఱు
నామమ్ పలవుమ్ నవిన్ఱేలో రెమ్బావాయ్.

## గీతము - 9

పరిశుద్ధ రత్న విరచిత దివ్య భవనాన
దీప పంక్తులు చుట్టు తేజరిలు చుండగా
అగరు ధూపములు గుమ గుమలాడుచుండగా
సుఖ శయ్య నిద్రి గూర్కెడు అత్త కూతురా!
మణుల తలుపుల గడియ మరి తీయగా రాదె?
అత్తరో లేపవే ఆమె నొక పరి నీవు?
మూగదా? చెవిటిదా? నీ ముద్దు బిడ్డ తా
రోగిష్టియా? లేపకుండ కాపుంచితివె?

మంత్రించి నావా విదర్శికు, మహా మాయావి!
వైకుంఠ వాస! మాధవ! యన్న నామముల
కీర్తించి, పార మార్థిక భక్తి భావాన
ఆమె మేల్కొన జేయు టావశ్యకము సుమ్మ!

## భావము :

పరిశుద్ధమైన, నవరత్న నిర్మితమైన దివ్య భవనములో చుట్టును దీప పంక్తులు ప్రకాశించుచుండగా, అగరు ధూపములు గుమ గుమలాడు చుండగా, సుఖశయ్యపై పవళించిన ఓ అత్త కూతురా! మణులతో కూడిన తలుపుల గడియ తీయుము. 'ఓ అత్తా! నీ కుమార్తె నొకసారి లేపుము నీ ముద్దుల కూతురు మూగదా? చెవిటిదా? లేక రోగిష్టిదా? ఆమెను లేపకుండా ఎవరినైనా కాపుంచితివా? లేక నిద్ర పట్టుటకు కాపుంచితివా ఏమి? మహా మాయావీ! వైకుంఠవాసా! మాధవా! అన్న నామములతో కీర్తించి, ఆమెను మేల్కొనునట్లు చేయుము.

## విశేషాంశములు :

రత్నములు 9 జీవునకు భగవంతునితో గల సంబంధములు కూడ తొమ్మిది విధములే

శ్లో॥ పితాచ, రక్షకః శేషీ భర్తాజ్ఞేయో రమాపతిః।
స్వామ్యాధారో మమాత్మాచ భోక్తా చాద్య మనూదితః

1. పితృ పుత్ర భావము, 2. రక్ష్య రక్షక భావము, 3. శేష శేషి భావము, 4 భర్తృ భార్యా భావము, 5. జ్ఞాతృజ్ఞేయ భావము 6. స్వ స్వామి భావము, 7. ఆధార ఆధేయ భావము, 8. శరీరాత్మ భావము, 9 భోక్తృ భోగ్య భావము.

సన్నివేశము : భగవదనుభవముచే గల్గిన సాత్త్విక నిద్రలో వున్న గోపికను మేల్కొలుపుచుండుట, భగవానుడే ఉపాయమని విశ్వసించిన సిద్ధోపాయ నిష్ఠలో నున్న ఆళ్వారులుగా ఈ గోపికలను పేర్కొనుట.

## పాశురము–10

నోత్తు చ్చువర్ క్కమ్ పుగుగిన్ఱ అమ్మనాయ్!
మాత్తముమ్ తారారో వాశల్ తిఱవాదార్
నాత్తత్తుళాయ్ ముడి నారాయణన్ ; – నమ్మాల్
పోత్తప్పఱై తరుమ్ పుణ్ణియనాల్! పండొరునాళ్
కూత్తత్తిన్ వాయ్ వీళ్న్ద కుమ్బ కరణనుమ్
తోత్తుమునక్కే పెరున్దుయిల్ తాన్ తన్దానో?
ఆత్త అనన్దలుడైయాయ్! అరుఙ్గలమే!
తేత్తమాయ్ వన్దు తిఱవేలో రెమ్బావాయ్.

## గీతము–10

నోము నోచియు స్వర్గ సుఖము గొను అమ్మాయి!
తలుపు తెఱవక యున్న పలుకైన పలుకవే?
వాసించు తులసి మాలల నలంకృతమైన
మకుటమ్ము దాల్చు నారాయణుడు, మా వంటి
వారు పాడిన మంగళమున సంతృప్తుడై
పురుషార్థ మొసగు పుణ్య స్వరూపుడు సుమ్ము
ఒకనాడు కుంభకర్ణుడు మృత్యు నోటిలో
పడి, నీకు నోడి యీ గాఢ నిద్దుర నిడెనా?

ఇంత నిద్దుర మత్తు ఎటులబ్బెనో నీకు
తెరుకొని వచ్చి, యిక తెఱువుమా తలుపిప్డు.

## భావము :

నోము నోచి, స్వర్గ సుఖమును పొందెడి అమ్మాయీ! నీవు తలుపు తెరవక పోయినచో పలుకైనా పలుకుము. వాసనలు వెదజల్లే తులసి మాలలతో అలంకరింపబడిన కిరీటము దాల్చిన శ్రీమన్నారాయణుడు మావంటి వారము పాడిన మంగళమున సంతృప్తి చెంది, పురుషార్థమైన 'పర'ను ప్రసాదించెడు పుణ్య స్వరూపుడు సుమా! ఒకనాడు కుంభకర్ణుడు మృత్యువు నోటిలో పడి, నిద్రలో నీవద్ద ఓడిపోయి, నీకు ఈ విధమైన గాఢ నిద్రను ఇచ్చెనేమో? ఇంత నిద్ర మత్తు నీకు ఎట్లు అబ్బెనో? నిద్ర మత్తు నుండి తేరుకొని, తలుపు తెరువుము.

## విశేషాంశములు :

1. 'అందరకు వ్రతము చేసిన గాని లభింపని కృష్ణుడు తానే వ్రతము చేసి వచ్చి, ఈమెను కలిసి యుండును. లేనిచో ఈమెకింతటి సుఖ నిద్ర ఎట్లు పట్టును? అనుకొనుచున్నారు గోపికలు. 2. కుంభకర్ణునికి తామస నిద్ర ఎంత గాఢమైనదో, ఈమెకు భగవదనుభవము వలన కలిగిన సాత్త్విక నిద్ర అంత గాఢమైనదయ్యెను.



సన్నివేశము : ఈ పాశురమున మేల్కొనబడు గోపిక కుల, రూప, గుణాదులచే అందమైనది. ఈమె వంశమునందలి పెద్దలు కర్మనిష్ఠ గలవారు. భగవంతుడే ఉపాయము,ఉపేయము అను విశ్వాసముతో ఈమె శ్రీకృష్ణునితో తాదాత్మ్యము పొందియున్నది. గనుకనే ఈమెను మేల్కొలుపుట.

## పాశురము-11

కత్తు క్కఱవై క్కణంగళ్ పలకఱన్దు
శెత్తార్ తిఱ లళియ చ్చెన్ఱు శెరు చ్చెయ్యుమ్
కుత్త మొన్ఱిల్లాద కోవలర్ దమ్ పొఱ్కొడియే
పుత్తర వల్ గుల్ పున మయిలే పోదరాయ్
శుత్తత్తు తోళి మారెల్లారుమ్ వన్దు ; నిన్
ముత్తమ్ పుగున్దు ముగిల్ వణ్ణన్ పేర్పాడ
శిత్తాదే పేశాదే శెల్వ ప్పెణ్డాట్టి నీ
ఎత్తుక్కుఱజ్గుమ్ పొరుళేలో రెమ్బావాయ్.

## గీతము-11

వత్సములు గల అల మందలెన్నిటొ పాలు
పితికి, శతృవుల బలము హతమార్చ గలవారు
పాప రహితులు నైన గోపాల వంశాన
బంగారు తీగవై ప్రభవించితివి నీవు
పుట్టలో పాము బోలిన నితంబిని నీవు
భాసించు వన బర్హి కేశ పాశము తోడ

రహి మించు వగలాడి! రావమ్మ వేవేగ
బంధువులు నెచ్చెలులు వాకిటనె నిల్చారు
నీలవర్ణుని నామములను కీర్తింపగా
పలుకు ఉలుకూ లేక పవ్వళించెద వేల?

## భావము :

దూడలు గల ఆల మందల నెన్నింటినో పాలు పితికి, శత్రువుల బలమును హతమార్చ గలవారును, పాప రహితులు నైన గోపాల వంశమునందు బంగారు తీగవై నీవు జన్మించితివి. పుట్టలోని పామువలె నున్న నితంబము గల దానా! అడవి యందలి నెమలి వంటి పొడవైన కొప్పు గలదానా! వేగముగా రమ్ము. చుట్టములును, చెలికత్తెలును వచ్చి నీ ముంగిటనే నిల్చియున్నారు. నీల వర్ణుడైన శ్రీ కృష్ణుని నామములను కీర్తించుచుండగా, నీవు ఉలుకూ పలుకూ లేక నిద్రించుచుంటి వెందులకు?

## విశేషాంశములు :

గోపాలుడు అనగా వేదమును రక్షించి, వేదములందు చెప్పబడిన ధర్మమును, జ్ఞానమును శిష్యులకు ప్రసాదింపగలవాడు. గోవులనగా వేదములు. వాని దూడలే అంగములు. వేదములకు భిన్నమైనవారే శత్రువులు. అజ్ఞాన తత్త్వమును హరించుటయే శత్రువులను హతమార్చుట.



సన్నివేశము : స్వధర్మము గూడ ఆచరింపని గోపాలుని సోదరిని మేలు కొలుపుట. గోపాలురందరును పరమాత్మయే ఉపాయము అని నమ్మినవారు. ఫలము నిచ్చుటకు సాధనముగా పరమాత్మనే నమ్ముకున్న గోపికను ఇందు మేల్కొలుపుట జరుగును.

## పాశురము-12

కనైత్తిళఙ్గ త్తెరుమై కన్ఱుక్కిరఙ్గి,
నినైత్తుములై వళియే నిన్ఱుపాల్ శోర,
ననైత్తిల్లమ్ శేఱాక్కుమ్ నచ్చెల్వ న్తఙ్గాయ్!
పనిత్తలై వీళ నిన్ వాశల్ కడై పత్తి
చ్చినత్తినాల్ తెన్నిలఙ్గై క్కోమానై చ్చెత్త
మనత్తుక్కినియానై ప్పాడవుమ్ నీవాయ్ తిఱవాయ్
ఇనిత్తా నెళున్దిరాయ్ ఈదెన్న పేరుఱక్కమ్
అనైత్తిల్లత్తారు మఱిన్దేలో రెమ్బావాయ్.

## గీతము - 12

దూడలందున జాలి దొడర గేదెలు అరచి
పొదుగులన్ దూడలని మూతు లుంచిన వంచు
తలచి సిరముల పాలు గురియింప ఇల్లంత
బురదయౌ సంపన్నుడగు వాని సోదరీ!
మంచు తలపై కురియ వచ్చి, నీ ద్వారమున
పై కమ్మి పట్టుకొని నిలచి యుంటిమి మేము

లంకాధిపతియైన రావణుం జంపియున్
ఎడద కింపగు రామ పుడమి పతి గీర్తింప
వాయి తెరువవు ఇంక లేవవా యిది యేమి?
నీ గాఢ నిద్ర నందరు తెలుసు కున్నారె!

## భావము :

లేగ దూడలపై జాలి కలిగి, గేదెలు అరచి, తమ పొదుగులలో దూడలు మూతులుంచిన వనుకొనుచు, పాలు పొదుగుల నుండి కురియింపగా, యిల్లంతయు బురదయగు సంపద గలవాని సోదరీ! మంచు తలపై కురియుచుండగా వచ్చి, నీ ద్వారపు పై కమ్మి పట్టుకొని,నిలచి యుంటిమి. లంకాధిపతియైన రావణుని చంపిన శ్రీరామచంద్రుని మేము కీర్తించుచున్ననూ, నీవు నోరు తెరువవు, లేవవేమి? ఈ గాఢ నిద్ర ఏమిటో అందరికీ తెలిసిపోయిందిలే!

## విశేషాంశములు :

మహిషి యనగా గేదె యనియు, పట్టపురాణి యనియు అర్థము. పట్టపు రాణి మహాలక్ష్మియే. చైతన్యవంతులను పరమాత్మ సన్నిధికి చేర్చుటలో మధ్యవర్తిత్వము చేయును. మహిషి రూపులగు ఆచార్యులు అజ్ఞులకై, శిష్యులకై ఆక్రోశించుదురు. అవియే గేదెలు అరచుట. తమ పొదుగులందు దూడలు మూతులుంచినవని భావించుటయే వాత్సల్యము



సన్నివేశము : నేత్రముల యందు సౌందర్యమున్న గోపికను ఇంకు మేల్కొలుపుచున్నారు. నేత్రమనగా జ్ఞానము. జ్ఞాన సౌందర్యమున్నచో కృష్ణుడే ఆమెను వెదకుకొని వచ్చునని భావము.

## పాశురము-13

పుళ్ళిన్ వాయ్ కీణ్డానైప్పొల్లా వరక్కనై,
క్కిళ్ళిక్కళైన్దానై క్కీర్తిమై పాడిప్పోయ్,
ప్పిళ్ళైగ ళెల్లారుమ్ పావైక్కళ మ్బుక్కార్,
వెళ్ళి యెళున్దు వియాళ ముఱఙ్గిత్తు,
పుళ్ళుమ్ శిలుమ్బిన గాణ్ పోదరిక్కణ్ణినాయ్,
కుళ్ళక్కుళి రక్కుడైన్దు నీరాడాదే,
పళ్ళిక్కిడత్తియో పావాయ్ నీనన్నాళాల్,
కళ్ళమ్ తవిర్న్దు కలన్దేలో రెమ్బావాయ్.

## గీతము - 13

బక రక్కసుని నోరు పట్టి చీల్చిన కృష్ణు
దుష్ట రావణు తలల ద్రుంచె నా రాఘువుని
యశము గీర్తించి, బాలలు వేడ్క బోవుచును
వ్రత క్షేత్రముం బ్రవేశించి మించిన వారు,
శుక్రుడుదయించె; నా గురుడస్తమించెడిన్;
పక్షులవి కూసె; తామరల తుమ్మెదలట్లు
భాసించు కనులతో వాసించు సుకుమారి!
తవిలి శాంతింపగా నవగాహన మొనర్చి

సిరాడకే పక్కపై పరుండెదవేల?
కలియుమా మాతోడ కపటమ్ము విడనాడి.

## భావము :

బకాసురుని నోటిని చీల్చిన శ్రీకృష్ణుని, దుర్మార్గుడగు రావణాసురుని తలలను తుంచివైచిన శ్రీరామచంద్రుని కీర్తి ప్రతిష్ఠలను గానము చేయుచు, వేడుకతో పిల్లలందరును వ్రత క్షేత్రమున ప్రవేశించినారు శుక్రుడు ఉదయించుచున్నాడు. గురుడు అస్తమించుచున్నాడు. పక్షులు కూయుచున్నవి. తామర పద్మములలోని తుమ్మెదల వంటి కన్నులు గల ఓ సుకుమారీ! తాపము చల్లబడునట్లు అవగాహన మొనర్చుకొని, స్నానము చేయక పాన్పుపై పరుండెదవేల? కపటము విడచి, మాతో కలియుము.

## విశేషాంశములు :

పరమాత్మతో తమకెడబాటు కల్గించుటకు సమకట్టిన, బక, రావణులను హతమార్చి, తమకు ఉపయోగ కారకుడైన భగవంతుని గోపికలు స్మరించి కీర్తించుచున్నారు. దంభమునకు బకము, అహంకారమునకు రావణుడు చిహ్నములు. శుక్రుడుదయించుట, గురుడు అస్తమించుట అనగా పరిశుద్ధ జ్ఞానము కలుగుట, అజ్ఞానము అంతరించుటగా భావించవలసియున్నది.



సన్నివేశము : తానే అందరికంటె ముందుగా మేల్కొని, తక్కినవారిని లేపెదనని చెప్పిన గోపిక తన పూర్వానుభవముచే మైమరచి, ఇతర గోపికలను మేల్కొలుపుట మరచి, ఇంటియందే వుండిపోయిన గోపికను మేల్కొలుపుట.

## పాశురము–14

ఉజ్గళ్ పుళైక్కడై త్తోట్టత్తు వావియుళ్
శెజ్గళు నీర్ వాయ్ నెగిళ్న్దు ఆమ్బల్ వాయ్ కూమ్బినకాణ్
శెజ్గల్ పొడిక్కూఱై వెణ్బల్ తవత్తవర్
తజ్గళ్ తిరుక్కోయిల్ శజ్గిడు వాన్ పోగిన్ఱార్
ఎజ్గళై మున్నమ్ ఎళుప్పువాన్ వాయ్ పేశుమ్
నజ్గాయ్! ఎళున్దిరాయ్ నాణాదాయ్ నావుడైయాయ్!
శజ్గొడు శక్కర మేన్దుమ్ తడక్కైయన్
పజ్గయ క్కణ్ణానై ప్పాడేలో రెమ్బావాయ్.

## గీతము–14

నీ పెరటి తోట బావిని నిండుగా నున్న
ఎఱ్ఱ తామరలు వికసించె; కలువలు ముగిడె;
కాషాయ వస్త్రముల, వెల్ల పల్వరునలన్
జోగు లర్చింప గుడిఁజొర బోవుచున్నారు;
మము ముందె మేల్కొల్ప మాట యిచ్చియు, సిగ్గు
మాలితివి పున్నమ్మ! మాటకారివి గదే!
కరములన్ శంఖ చక్రముల దాల్చినవాడు,
పొడవు చేతులవాడు, పుండరీకాక్షుండు

మనకు దైవము ; అతని మనసార గీర్తింప
లేచి రావమ్మ నోలాచి పిల్పెదమిపుడు.

## భావము :

ఓ పున్నమ్మా! నీ పెరటి తోటలోని బావిలోనున్న ఎఱ్ఱ తామర పూవులు వికసించినవి. కలువలు ముడుచుకొనుచున్నవి. కాషాయ వస్త్రములు ధరించి, తెల్లని పలువరుసలు గల సన్యాసులు ఆలయముల లోనికి పూజలకై పోవుచున్నారు. మమ్ములను ముందుగనే మేల్కొల్పెదనని మాట యిచ్చియు, సిగ్గు మాలిన మాటకారివి గదే! హస్తములందు శంఖ, చక్రములు ధరించిన వాడును, ఆజానుబాహుడును అయిన పుండరీకాక్షుడు మనకు దైవము. కనుక; అతని మహిమలను కీర్తించుటకు పిల్చుచుంటిమి రావమ్మా!

## విశేషాంశములు :

సన్యాసులనగా సాత్త్వికులు. భగవంతుని అర్చించుటకు సాత్త్వికులే అర్హులు. వారు కాషాయములను దాల్చుట వైరాగ్యమునకు చిహ్నము. కాషాయము భోగ విరక్తికీ, వైరాగ్య రక్తికి గుర్తు. ఈమెను పూర్ణురాలా (పున్నమ్మా) అని సంబోధించుటలో ఈమె పరమాత్మనే గాక, అతనిలోని గుణములను కూడా ఉపాసించుటచే పూర్ణోపాసన నిష్ఠయైనదనే భావము ఇమిడియున్నది.



సన్నివేశము : ఇంతవరకు తొమ్మిది మంది గోపికలను మేల్కొలిపిన పిమ్మట, ఇందు పదవ గోపిక మేల్కొల్పబడుచున్నది. ఈ పది మందియు భగవద్భక్తులే. పూర్వ భాగమందు భక్తులను మేల్కొల్పు కార్యము దీనితో ముగియును.

## పాశురము-15

ఎల్లే ఇళఙ్గిళియే ఇన్నముఱఙ్గుదియో
శిల్లెన్ఱళై యేన్మిన్ నఙ్గైమీర్ పోదరు గిన్ఱేన్
వల్లైయున్ కట్టురైకళ్ పణ్డేయున్ వాయఱిదుమ్
వల్లీర్ కళ్ నీఙ్గళే ; నానే దానా యిడుగ
ఒల్లై నీ పోదాయ్ ఉనక్కెన్న వేఱుడై మై
ఎల్లారుమ్ పోన్దారో పోన్దార్ పోన్దెణ్ణిక్కొళ్
వల్లానై కొన్ఱానై మాత్తారై మాత్తళిక్క
వల్లానై మాయనై ప్పాడేలో రెమ్బావాయ్.

## గీతము-15

బయటి గోపికలు :

ఏమింక నిద్రించు చుంటివే లేఁజిలుక?

లోపలి గోపిక :

చీకాకు గొల్పగా జిల్లుమని పిలువకుడు
పూర్ణ గోపికలార! వచ్చుచున్నానిదే_

బయటి గోపికలు :

ఓ మాటకారి! నీ నేర్పుగల మాటలను
ఎరుగుదుముతే ముందె, ఏమి చెప్పెదవింక?

లోపలి గోపిక :

నేర్పరులు మీరె యిక నేనే కఠినాత్మకను-

బయటి గోపికలు :

ఇప్పుడే రారమ్మ! ఏమి ప్రత్యేకతయొ?

లోపలి గోపిక :

వచ్చిరా అందరును వనితలారా చెపుడి?

బయటి గోపికలు :

వచ్చిరిక వచ్చి లెక్కించుకోగదవమ్మ!

లోపలి గోపిక :

చెప్పండి. నే వచ్చి చేయవలసినదేమి?

బయటి గోపికలు :

మదపు టేనుగు జంపి, మాత్సరను హతమార్చె,
మాయావి యగు కృష్ణు కీర్తింపగా రమ్మ!

**భావము :** ఇందు లోనున్న గోపికకు, బయటనున్న గోపికలకు సంవాదము జరిగినది. 'ఇంకను నిద్రించుచున్నావా?' అని బయటివారు ప్రశ్నించగా, 'తనకు చీకాకు కలుగునట్లు పిలువ వద్దని, వచ్చెదనని లోపలి గోపిక జవాబిచ్చినది. 'నీ మాటకారి తనం మాకు తెలుసు. ఇంకేమి చెప్పెదవులే' అని బయటి గోపికలు అనగా, 'ఔను. మీరందరు నేర్పరులే. నేనే కఠినాత్మురాలను' అని లోపలి గోపిక అన్నది. 'నీ ప్రత్యేకత యేమి? వెంటనే బయటికి ర'మ్మని వారు పిలువగా, 'అందరూ వచ్చినారా?' అని లోపలినుండి గోపిక ప్రశ్నించినది. 'అందరును వచ్చినారు. నీవు వచ్చి, లెక్కించుకొ'మ్మని బయటివారు చెప్పగా, 'నేను వచ్చి, చేయవలసినదేమి'యని లోనుండి ఆమె ప్రశ్నించినది దానికి, 'శ్రీకృష్ణుని కీర్తింపగా ర'మ్మని బయటి గోపికలు కోరిరి.

## విశేషాంశములు :

కువలయాపీడము. కు = భూమి, వలయము = మండలమును, ఆపీడము = పీడించునది. అదియే అహంకారము. చాణూర ముష్టికులు కామ, క్రోధములు. వాటిని అంతము చేయువాడే సర్వేశ్వరుడు అట్టి శ్రీకృష్ణుని కీర్తింప రమ్మని లోపలి గోపికను కోరిరి.

సన్నివేశము · గొల్ల పెద్దలు మహా పురుషులద్వారా భగవానుని ఆశ్ర
యించుట పీరెరుగుదురు. కాబట్టి, నిద్రపోవుచున్న
గోపికలను మేల్కొలుపుకొని, అందరును నందగోపుని
భవనమునకు వచ్చుటయు, ఇక్కడ భవన పాలకుని,
ద్వారపాలకుని అర్చించి లోపలకు ప్రవేశించుటయు
జరుగును.

## పాశురము-16

నాయగ నాయ్ నిన్ఱ నన్ద గోపనుడై య
కోయిల్ కాప్పానే! కొడిత్తోన్ఱుమ్ తోరణ
వాశల్ కాప్పానే! మణి క్కదవమ్ తాళ్ తిఱువాయ్,
ఆయర్ శిఱు మియరో ముక్కు ; అఱై పఱై
మాయన్ మణి వణ్ణన్ నెన్నలే వాయ్ నేర్న్దాన్ ;
తూయో మాయ్ వన్దోమ్, తుయిలెళ పాడువాన్
వాయాల్ మున్న మున్నమ్ మాత్తాదే, అమ్మా! నీ,
నేశ నిలై క్కదవమ్ నీక్కేలో రెమ్బావాయ్.

## గీతము - 16

మాకు నాయకుడైన నంద గోపుని భవన
పాలకా! తోరణంబుల తోడ, జెండాతొ
అలరారు ద్వార పాలక! రత్నమయమైన
తలుపులన్ వెలయు గడియను తెఱువుమయ్యా!
మా తూవియున్ మరియు మణి వర్ణుడౌ కృష్ణ
పరమాత్మ, గోపికల మగు మాకు నిన్న నే

ధ్వని చేయు 'పర' వాద్యమును ఇత్తునన్నాడు
పరిశుద్ధ మతిని నిద్రను వీడునట్లుగా
పాడుటకు వచ్చితిమి మును ముందుగా స్వామి!
నీ నోటితో నిషేధింపకుము ; దగ్గరగ
బలముగా నున్న తలుపులు నీవు తెరువుమా
అర్థింతు మిపుడు మనసార స్వామిని గొల్చి.

## భావము :

మాకు నాయకుడైన నందగోపుని భవన పాలకా! జెండా మరియు తోరణములతో అలరారు ద్వారపాలకా! మణి నిర్మితమైన తలుపుల గడియను తెరువుము. మాయావియు, ఇంద్ర నీల మణి వర్ణుడును అయిన కృష్ణుడు గోపికలమైన మాకు 'పర' అను వాద్యమును ఇచ్చెదనని నిన్ననే మాట యిచ్చినాడు. మేము పరిశుద్ధ భావముతో శ్రీకృష్ణుని మేల్కొల్పుటకు గానము చేయ వచ్చితిమి. స్వామి! ముందుగనే నీవు నిషేధింపకుము. దగ్గరగా బలముగా నున్న తలుపులను తెరువుమని నిన్ను అర్థించుచున్నాము. మనసార స్వామిని గొల్చినవారము. కావున మా అభ్యర్థన మన్నింపుము.

## విశేషాంశములు :

నందగోపుడు ఆచార్యుడు. నంద = ఆనందించువాడు, గోపుడు = కాపాడువాడు నాయకుడైన నంద గోపుని భవనము మంత్రము. కోన్ = స్వామి, ఇల్ = వాన స్థానము, కోయిల్ = సర్వేశ్వరుని ప్రతిపాదించు మంత్రము.



సన్ని వేశము : నందగోపుని భవనమున ప్రవేశించిన గోపికలు శయనించి యున్న నందగోపుని, యశోదను, శ్రీకృష్ణ, బలరాములను ఒక్కొక్కరిని మేల్కొలుపుట.

## పాశురము-17

అమ్బరమే ; తణ్ణీరే ; శోఱే అఱమ్ శెయ్యుమ్
ఎమ్బెరుమాన్! నన్ద గోపాలా! ఎழுన్దిరాయ్ ;
కొమ్బనార్కెల్లామ్ కొழுన్దే! కుల విళక్కే!
ఎమ్బెరుమాట్టి! యశోదాయ్! అఱివుఱాయ్ ;
అంబర మూడఱుత్తోఙ్గి యుల గళన్ద
ఉమ్బర్ కోమానే ! ఉఱఙ్గాదెழுన్దిరాయ్!
శెమ్ పొఱ్కழలడిచ్చెల్వా! బలదేవా!
ఉమ్బియుమ్ నీయు ముఱఙ్గేలో రెమ్బావాయ్.

## గీతము - 17

పుట్టములు చన్నీళ్ళు బోనమ్ము (గైసేయు
మా స్వామి! నంద గోపా మేలుకోవయ్య!
ప్రబ్బలిం బోలు వనితల కంటురమ్మువౌ
యశోదా! వంశ మణి దీపమా! స్వామినీ!
మేలుకో! ఆకాశ మధ్య భాగము చీల్చి
పెరుగు శూరా! ఓ త్రివిక్రమా! మేలుకో!
కమనీయ బంగారు కాలియందెను దాల్చు
బలభద్రుడా! మేలుకో! నీదు సోదరుడు

శ్రీ కృష్ణమూర్తియును చెలువారు లీలలన్
మమ్మేలుకోగ వే మేలుకొనవయ్యా!

## భావము :

వస్త్రములు, నీరు, భోజనము మాకు ప్రసాదించునట్టి మా స్వామీ! నంద గోపాలా! మేలుకొనుము. ప్రబ్బలి చెట్లవంటి సుకుమార వతులైన స్త్రీలలో అంకురము వంటి మా వంశమందలి మణి దీపమా! మా స్వామినీ! యశోదా దేవీ! మేల్కొనుము. ఆకాశ మధ్య భాగమును చీల్చుకొని, పెరుగునటువంటి త్రివిక్రమా! ఓ శూరా! మేలుకొనుము. శ్రేష్ఠమైన బంగారు కాలియందెను ధరించునట్టి బలభద్రుడా! మేలుకొనుము. నీవును, నీ తమ్ముడును మేల్కొని మమ్ము పాలించండి.

## విశేషాంశములు :

శ్రీకృష్ణుడు ద్రౌపదికి వస్త్రములిచ్చెను. భారత యుద్ధమున పాండవుల రథమునకు పూన్చిన గుఱ్ఱములకు దప్పిక కాగా, శ్రీకృష్ణుడు వారుణాస్త్రమును ప్రయోగించి, నీటిని గుఱ్ఱముల కొసగి, దప్పి తీర్చినాడు. శ్రీకృష్ణుడు బలరామునితో కలిసి, అడవి కేగినపుడు గోపాలురకు ఆకలి వేసెను. అపుడు శ్రీకృష్ణుడు మునుల భార్యల వద్ద నుండి అన్నము తెప్పించి యిచ్చెను.



సన్నివేశము : శ్రీకృష్ణుని పొంది, అనుభవింపవలెననెడి ఆకాంక్షతో గోపికలు మేల్కొలిపినను, అతడు మేల్కొనలేదు. తుదకు తెలివిగా నీలాదేవి ద్వారా స్వామిని ఆశ్రయింపవచ్చునని ఆమెను మేల్కొలుపుట.

## పాశురము-18

ఉన్దు మద కళిత్త నోడాద తోళ్ వలియన్
నన్ద గోపాలన్ మరు మగళే! నప్పిన్నాయ్!
కన్దమ్ కమళుమ్ కుళలీ! కడై తిఱవాయ్;
వన్దెఙ్గుమ్ కోళి యళైత్తన గాణ్ ; మాదవి
ప్పన్దల్ మేల్ పల్ కాల్ కుయిలి నఙ్గళ్ కూవినగాణ్ ;
పన్దార్ విరలి! ఉన్ మైత్తునన్ పేర్ పాడ,
చ్చెన్దామరై క్కైయాల్ శీరార్ వళైయొలిప్ప
వన్దు తిఱవాయ్ మగిళ్న్దు ఏలో రెమ్బావాయ్.

## గీతము-18

మద గజ బలుండు దోశ్శక్తి సంపన్నుడౌ
నంద గోపుని కోడలా! వాసనలు గ్రమ్ము
వెరి కొప్పు గలదాన! నీలా సతీ! వేగ
గడియ తీయుము ; అంతటున్ కోళ్ళు కూసెడున్
పూల గురివెంద పందిరి మీద కోయిలల్
కూసె ; బంతిని పట్టుకున్న [వేళులదాన!
నీ మేన బావఁ గీర్తింపగా వచ్చితిమి;
చేతి గాజులు ఘల్లు ఘల్లునన్ మ్రోయంగ

వచ్చి, ఎఱ్ఱని పద్మమును బోలు చేతితో
తెఱువుమా తలుపు సంతృప్తి చెందిన యెదను.

## భావము :

మదపు టేనుగులవంటి బలము కలవాడును, భుజ బల సంప న్నుడును అయిన నంద గోపుని కోడలా! వాసనలతో గుప్పుమను పొడవైన కొప్పు గలదానా! ఓ నీలాదేవీ! వెంటనే తలుపు గడియ తీయుము. అన్ని యెడలను కోళ్ళు కూయుచున్నవి. పూల గురివెంద చప్పరముపై కోయిలలు కూసినవి బంతిని పట్టుకున్న వ్రేళ్ళు కల దానా! నీ మేన బావ గుణములను కీర్తించుటకు వచ్చితిమి. నీ చేతి గాజులు ఘల్లు ఘల్లున మ్రోయుచుండగా వచ్చి, సంతృప్తి చెందిన మనస్సుతో ఎఱ్ఱని పద్మమును బోలు చేతితో తలుపు తెఱువుము.

## విశేషాంశములు :

మదించిన ఏనుగును (అహంకారము) జయించినవాడే ఆచా ర్యుడు. కావున నందగోపుడు ఆచార్యుడు. అట్లే భగవత్ప్రాప్తికి ఆటం కమును కలిగించు కామ, క్రోధాది శత్రువులను జయించుటచే భుజ బల సంపన్నులుగా ఆచార్యులను వర్ణించుట. భగవానుని అమ్మవారి ద్వారా ఆశ్రయించుట యుక్తమని భావించబడినది. రామానుజులు శ్రీమన్నారాయణుని శరణము పొందుటకు ముందుగా, శరణాగతి గద్యమున అమ్మవారిని శరణము పొందిరి.



సన్ని వేశము : లక్ష్మీదేవి పురుష కారము, అనగా మధ్యవర్తిని. ఆమె అంశమే నీలాదేవి గనుక, ఆమె మధ్యవర్తిత్వంతో పరమాత్మను ఆశ్రయించాలని, ఫలితంగా లక్ష్మీనారాయణుల నిద్దరను ఆశ్రయించినట్లు అవుతుందని ఇద్దరినీ ఈ పాశురమున మేల్కొలుపుట కనిపించును.

## పాశురము–19

కుత్తు విళక్కెరియ క్కోట్టుక్కాల్ కట్టిల్ మేల్
మెత్తెన్ఱ పఞ్చశయ నత్తిన్ మేలేఱి,
కొత్తలర్ పూఙ్కుళల్ నప్పిన్నై కొఙ్గై మేల్
వైత్తుక్కి డన్దమలర్ మార్పా! వాయ్ తిఱవాయ్
మైత్తడ ఙ్కణ్ణినాయ్! నీయు న్మణాళనై
ఎత్తనై పోదుమ్ తుయిలెళ వొట్టాయ్ కాణ్!
ఎత్తనై యేలుమ్ పిరివాత్త గిల్లాయాల్
తత్తువ మన్ఱుత్తక వేలో రెమ్బావాయ్.

## గీతము–19

ప్రజ్వలింపగ గుత్తి దీపాలు, దంతంపు
కోళ్ళు గల మంచాన పంచగుణ శయ్యన్
కుసుమించినట్టి పూ గుత్తులన్ చెన్నొందు
నిదుర పెన్నెరి నొప్పు నీలా స్తనాలపై
అనుకొని నిద్రించి, అలరు వక్షమ్ముతో
రాజిల్లు కృష్ణ! నోరార మాటాడవే
కాటుకన్ దీర్చి చక్కగ విశాలాక్షివై
క్షణకాలమైన కాంతుని లేవనీయవా?

ఒక్కింత యెడబాటు నోర్వలేకుంటివా?
వలదు నీకి స్వరూపము స్వభావము నీల!

## భావము :

గుత్తి దీపములు ప్రకాశించుచుండగా, దంతపు కోళ్ళు గల మంచము మీద, అయిదు గుణములు గల పరుపుపై, అరబూచిన పూల గుత్తులతో అలంకరింపబడిన పొడవైన కొప్పు గల నీలాదేవి స్తనములపై అనుకొని నిద్రించి, విశాలమైన వక్షస్థలముతో ప్రకాశించు శ్రీకృష్ణా! నోరార మాటాడుము. కాటుక దిద్దిన విశాలమైన కన్నులు గల ఓ నీలాదేవీ! నీవు నీ ప్రియుని క్షణకాలమైనను లేవనీయవా? కాసింత ఎడబాటును ఓర్వలేకున్నావా? నీకి స్వరూపము, స్వభావము తగదు.

## విశేషాంశములు :

శయ్యకుగల పంచగుణములు : చల్లదనము, మెత్తదనము, తెల్లదనము, ఎత్తు, వెడల్పు తగినట్లుండుట. నీలాదేవికి దీపపు కాంతిలో కృష్ణానుభవము పొందు భాగ్యము లభించినది. బయటనున్న గోపికలకు చీకటియే కృష్ణానుభవమునకు దోహదమగును. నీలాదేవి కారుణ్య రూప సంకల్పావస్థలో మేల్కొని గోపికలను తనకు సంబంధించినవారినిగా భావించి, వారి కోరికను స్వీకరించెను. కావున పరమాత్మకు కూడ గోపికలను రక్షింపవలసిన బాధ్యత ఏర్పడినది.



సన్నివేశము : జీవునకు నారాయణుడే ఉపాయమను బుద్ధిని కలిగించి, భగవంతుడు అంగీకరించేలా శ్రీదేవిని ఆశ్రయించినచో భగవంతుని ఆశ్రయించినట్లేయగునని శ్రీ మరియు నారాయణుల అవతారమగు నీలాదేవియు శ్రీ కృష్ణుడును ఇందు మేల్కొనబడుదురు.

## పాశురము-20

ముప్పత్తు మూవర్ అమరర్కు మున్ శెన్ఱు
కప్పమ్ తవిర్కుమ్ కలియే! తుయిలెళాయ్;
శెప్పముడైయాయ్! తిఱలుడైయాయ్! శెత్తార్కు
వెప్పఙ్గొడుక్కుమ్ విమలా! తుయిలెళాయ్;
శెప్పన్న మెన్ములై చ్చెవ్వాయ్ చ్చిఱు మరుఙ్గల్
నప్పిన్నై నఙ్గాయ్! తిరువే! తుయిలెళాయ్
ఉక్కముమ్ తట్టొళియుమ్ తన్దున్ మణాళనై
ఇప్పోతే యెమ్మై నీరాట్టేలో రెమ్పావాయ్.

## గీతము - 20

కదిసి మును మున్ను ముప్పది మూడు కోట్ల, దే
వతల భయమును బాపు బలశాలి నీవే!
శక్తి సంపన్న! ఆర్జవశాలి! ఆశ్రితుల
శాత్రవులకున్ భయ జ్వర కారకా! విమల
తత్త్వనిధి మేల్కొనుము ; త్వరిత గతి రారమ్మ!
హేమ కలశ స్తనీ! బింబోష్ఠి! హరి మధ్య!
శ్రీతుల్య! పరిపూర్ణ! నీలాసతీ లెమ్మ!
అలవట్టము కంచు టద్దమ్ము మాకిచ్చి,

నీ వల్లభుని కృష్ణు నీరాడ మా తోడ
ఇప్పుడే అవకాశమిడగ ప్రార్థించెదము.

## భావము :

మనం ముందుగనే పోయి, ముప్పది మూడు కోట్ల దేవతలకు భయమును పోగొట్టునట్టి బలశాలివి. శక్తియే సంపదగా కలవాడా! ఆర్జవశాలీ! నిన్ను ఆశ్రయించి యున్నవారి శత్రువులకు భయమును, జ్వరమును కలిగించువాడా! స్వచ్ఛమైన తత్త్వనిధీ! మేల్కొనుము. బంగారు కుండలవంటి స్తనములును, దొండపండువంటి పెదవియు, సింహమువంటి సన్నని నడుమును కలిగిన పరిపూర్ణురాలా! లక్ష్మీ సమానురాలా! నీలాసతీ! మేల్కొనుము. విసనకర్రయు, కంచుటద్దమును మాకు ఇచ్చి, నీ వల్లభుడైన శ్రీకృష్ణునితో మేము నీరాడుటకు అవకాశమిమ్ము.

## విశేషాంశములు :

ఇందు గోపికలు కోరునట్టి స్నానము భగవంతుని అనుభవమును అవగాహనమొనర్చుకొనుట జీవ స్వరూప జ్ఞానమును తెలియునట్టి విధముగ చేయునది ప్రణవము. అదియే వీరు కోరునట్టి అద్దము. ఆత్మలకు అహంకార, మమకారములవల్ల కలుగు క్లేశము లనెడి స్వేద జలమును పోగొట్టునట్టి విసనకర్రను కోరుకొనిరి. అనగా ఆత్మలకు తాపము తొలగి, శాంతము కలిగించు సాధనమది. తమను భగవత్ ప్రాప్తికి సన్నిహిత మొనర్చుమని అర్థము.



సన్నివేశము : పురుషకార భూతురాలయిన నీలాదేవిని గోపికలు మేల్కొలిపిరి. ఆమె మేల్కొని, తాను కూడా వారిలో నొకతెగా అందరునూ కలిసి, శ్రీకృష్ణ భగవానుని మేల్కొలుపుట.

## పాశురము-21

ఏత్త కలఙ్గళ్ ఎదిర్ పొఙ్గి మీదళిప్ప
మాత్తా దేపాల్ శొరియుమ్ వళ్ళల్ పెరుమ్ పశుక్కళ్
ఆత్తప్ప డైత్తాన్ మగనే! యఱివుఱాయ్;
ఊత్తము డైయాయ్! పెరియాయ్! ఉలగి నిల్
తోత్తమాయ్ నిన్ఱ శుడరే, తుయిలెళాయ్;
మాత్తారు నక్కు వలితులైన్దు ఉన్ వాశఱ్కణ్
ఆత్తాదు వన్దు ఉన్నడి పణియు మాపోప్పలే
పోత్తియామ్ వన్దోమ్ పుగళ్న్దు ఏలో రెమ్బావాయ్.

## గీతము - 21

పొంగు క్రిందటి కడవ పూర్ణమై పొంగారు
పాల్గురియు ధేను సంపద గల్గి యలరారు
నంద గోప కుమార! మేల్కొనుము! మేల్కొనుము!
దార్ఢ్య సంపన్న! సంతత దివ్య తేజస్వి!
అప్రమేయా! లెమ్ము; లోకావతారుండ!
అరులెల్ల నీ కోడి అరుదెంచి ముంగిటను

నీ పాదముల నుతించిన రీతి మేమెల్ల
కీర్తింప మంగళము, తెరలి వచ్చితి మిప్డు.

## భావము :

పొదుగు క్రింద ఉంచిన కడవలు నిండి, పొంగి పడునట్టి పాలు గురిసెడు గోవులనెడి సంపదగల ఓ నందగోపుని కుమారుడా! మేలుకొనుము దృఢమనెడి సంపద గలవాడా! దివ్య తేజస్వీ! అప్రమేయా! మేల్కొనుము. లోకావతారా! శత్రువులందరును నీ వద్ద ఓడిపోయిన వారై వచ్చి, నీ ముంగిట నీ పాదములను స్తుతించిన విధముగా, మేము అందరమును మంగళము పాడుటకు వచ్చితిమి.

## విశేషాంశములు :

దార్ఢ్యమనగా ప్రమాణ దార్ఢ్యము. ప్రమాణ దార్ఢ్యము గలవాడు బ్రహ్మ స్వరూపుడు. దివ్య తేజస్వి అనగా జ్యోతి స్వరూపుడు. భగవంతునియందు ప్రీతి లేనివారు బాణములకు ఓడిపోవుదురు. ప్రీతి గల వారు (భక్తులు) స్వామి గుణములకు లొంగి వశవర్తులగుదురు. గోపికలు స్వామి గుణములకు ఓడి వచ్చినవారు. కావున భక్తులు.



సన్ని వేశము : పరమాత్మ అతిశయ తత్త్వమును వర్ణించుటకు శత్రు
షులు అహంకారమును విడిచి, తన సింహాసనము క్రింద
వసించెదరని చెప్పబడెను. అనగా, తాము కూడా పర
మాత్మకు చెందినవారేనని స్పష్టము చేయుటలో స్వామి
ఎంతటి ఉదారుడో తెలియును.

## పాశురము-22

అఙ్గణ్ మాఞాలత్తరశర్, అబిమాన
బఙ్గమాయ్ వన్దునిన్ పళ్ళిక్కట్టిల్ కీళే
శఙ్గ మిరుప్పార్ పోల్వన్దు తలైప్పెయ్ దోమ్
కిఙ్గిణి వాయ్ చ్చెయ్ద తామరై ప్పూ ప్పోలే
శెఙ్గణ్ శిఱిచ్చిఱిదే యెమ్మేల్ విళియావో;
తిఙ్గళు మాదిత్తియను మెళున్దాఱ్పోల్
అఙ్గణి రణ్డుఙ్గొణ్డు ఎఙ్గళ్ మేల్ నోక్కుదియేల్
ఎఙ్గళ్ మేల్ చాబ మిళిన్దేలో రెమ్పావాయ్.

## గీతము-22

సుందర విశాల పృథివీ మండలము నేలు
వారు తమకంటె నధికులు లేరటంచున్
గొన్న హంకృతి విడిచి, కోరి మీదగు సింహ
పీఠి క్రిందను వినయ కోటియై వసియింతుర్
వారి పోలిక మేము వచ్చి చేరితి మయ్య
చిరుగంట వాయి వలె నరవిరియు తమ్మిగా

అర్ధ్రమున ఎఱ్ఱనైనట్టి క్రొగన్నులన్
సూర్య, చంద్రోదయపు సుందరాకృతి తోడ
మాపై కటాక్షించి, మా శాపముల్ తొలగఁ
జేయ ప్రార్థింతుమో శ్రీకృష్ణ పరమాత్మ!

## భావము :

అందమైన మరియు విశాలమైన భూమండలము నేలు రాజులు తమకంటె గొప్పవారు లేరనెడి అహంకారమును విడిచి, వచ్చి, మీ సింహాసనము క్రింద గుంపులుగా చేరి వసించెదరు. వారివలె మేమును వచ్చి చేరితిమి. చిరుగంటు ముఖమువలె అరవిచ్చిన తామర పూవువలె దయవలన ఎఱ్ఱనైన కన్నులు మెల్ల మెల్లగా విప్పి, సూర్య చంద్రుల సుందరమైన ఆకారముతో మాపై దయ చూపి, మా శాపములను తొలగింప ప్రార్థించుచున్నాము.

## విశేషాంశములు :

భూమిని పాలించు రాజులు తమ అహంకారము విడిచి, చక్రవర్తి యొద్దకు వచ్చినట్లు గోపికలు శ్రీకృష్ణుని యొద్దకు వచ్చిరి ఈశ్వరత్వము ఒక్క సర్వేశ్వరునిదే అయి వుండగా, కొందరు అహంకారముతో తామే ఈశ్వరునిగా భావించుకొందురు ఆత్మల రూపమునయున్న గోపికలు పరమాత్ముడగు శ్రీకృష్ణుని ఆశ్రయించిరి. అనగా అభిమానము విడచి, కృష్ణ సంశ్లేషమునకు అర్హులైరి.



పన్ని వేశము : గోపికలు తమ కోరికను రహస్యముగ నివేదించుటకు అంగీకరించక, అస్థాన మండపమునకు వేంచేసిన స్వామికి తమ మనోరథమును పరిశీలింప గోరుట. శ్రీకృష్ణుడు నిద్రించినపుడు గోపికలు అతని సౌందర్యమును దర్శించిరి. ఇపుడు స్వామి సౌందర్యమును తిలకించవలెనని భావించుట గోచరించును.

## పాశురము-23

మారి మలై ముళఞ్జిల్ మన్ని క్కిడన్దుఱఙ్గుమ్
శీరియ శిఙ్గ మఱివిత్తుత్తీ విళిత్తు
వేరి మయిర్ పొఙ్గ వెప్పాడుమ్ పేర్న్దుదఱి
మూరి నిమిర్న్దు ముళఙ్గిప్పు అప్పట్టు
పోదరు మాపోలే; నీ పూవై ప్పూవణ్ణా! ఉన్
కోయిల్ నిన్ఱిఙ్గనే పోన్దరుళి, కోప్పుడైయ
శీరియ శిఙ్గాసనత్తిరున్దు, యామ్ వన్ద
కారియ మారాయ్ న్దరుళేలో రెమ్బావాయ్.

## గీతము-23

వర్షర్తువందు పర్వత కుహరమందునన్
నిశ్చల స్థితిని నిదురించు శౌర్యపు సింహ
మదియె మేల్కొని, తీవ్రమగు దృష్టి నీక్షించి,
వాసించు మేని రోమములు నిగుడగ జేసి,
దొర్లి దొర్లియు మేని దులుపుకొని, మెయిసాచి
గర్జించి, గుహనుండి గడగి వెల్వడి వచ్చు

పగిది గానుగ పూవువంటి మెయి చాయతో
నీకు భవనము నుండి నేత్యుగన్ విచ్చేసి,
అపురూప సింహాసనమున కొలువున్నావు
కరుణించి మా కార్యమెరుగ ప్రార్థించెదము.

## భావము :

వర్షాకాలమున పర్వత గుహయందు నిశ్చలముగా నిద్రించు శౌర్యముగల సింహము మేల్కొని, తీక్ష్ణమైన చూపులతో, ఒంటి వెండ్రుకలు విగిడించి, అటు ఇటు దొర్లి, శరీరము దులుపుకొని, శరీరము బార సాచి, గర్జించి గుహను వెడలి వచ్చు విధముగా నల్ల అగిసెపువ్వువంటి మేని చాయతో నీ భవనము నుండి బయటికి వచ్చి, అపురూపమైన సింహాసనమున కొలువున్నావు. మేము వచ్చిన కార్యమును దయతో ఎరుగ ప్రార్థించుచున్నాము స్వామి!

## విశేషాంశములు :

భరద్వాజునకు వేదములు పర్వతములుగా కనిపించినవట. అటువంటి పర్వతస్వరూపమైన వేదములలో ఎవరికీ తెలియని విధముగా పరమాత్మ తత్త్వము నిక్షిప్తమై యుండును. పరమాత్మ సృష్టికి ముందు ప్రళయమున నిద్రించి యుండును. ప్రళయమున నామరూపములు లేకుండా పరమాత్మ సర్వజగత్తును హింసించును. కావున పరమాత్మ సింహమే.



సన్నివేశము : పరమ పదము వేంచేసియున్న నారాయణుడు మన వలెనే ఈ లోకమున అవతారము దాల్చి, రామకృష్ణ రూపములతో నున్న వేళ, ఆ రూపములను దర్శించి, ప్రేమ పారవశ్యంతో మంగళము పాడుచుందురు. ఈ విధమగు మంగళాశాసనమొనర్చుటయే పరమ పురుషార్థమని భావించుట.

## పాశురము-24

అన్ఱివ్వులగ మళన్దాయ్! అడి పోత్తి;
చ్చెన్ఱఙ్గు త్తెన్నిలఙ్గై శెత్తాయ్! తిఱల్ పోత్తి;
పొన్ఱచ్చగడ ముదైత్తాయ్! పుగళ్ పోత్తి;
కన్ఱు కుణిలా వెఱిన్దాయ్! కళల్ పోత్తి;
కున్ఱుకుడై యాయెడుత్తాయ్! గుణమ్ పోత్తి;
వెన్ఱు పగై కెడుక్కుమ్ నిన్ కైయిల్ వేల్ పోత్తి;
ఎన్ఱెన్ఱున్ శేవగమే యేత్తిప్పఱై కొళ్వాన్
ఇన్ఱియామ్ వన్దోమ్ ఇరఙ్గేలో రెమ్బావాయ్.

## గీతము-24

నాడు లోకము కొల్చినట్టి మీ పదములకు
మంగళము! అటుకు దక్షిణనున్న అందాల
లంక గూల్చిన మీదు లావునకు మంగళము!
శకటాసురుని రూపు చరణాన పోనాడు
మీ కీర్తికిన్ మంగళము! దూడ రక్కసున్
వెలగ రక్కసు పైకి ఒడిసెలో రాయివలె

విసరి చంపిన దివ్య పదములకు మంగళము!
గోవర్ధనమ్ము నొక గొడుగుగా నెత్తు మీ
వాత్సల్యమునకు మంగళము! శత్రుల దునుమించు
మీ చేతి వేలాయుధమ్మునకు మంగళము!
తనరు మీ వీర చరితమ్ము గీర్తింపగా
వచ్చితిమి 'పఱ' యిచ్చి మమ్ము కరుణింపుమీ.

## భావము :

అనాడు లోకమును కొలచిన మీ పాదములకు మంగళము. అచ్చటకు దక్షిణ దిశనున్న అందమైన లంకా పట్టణమును ధ్వంసము చేసిన మీ బలమునకు మంగళము. శకటాసురుని పాదములతో తన్ని అంతమొందించిన మీ కీర్తికి మంగళము. వత్సాసురుని వెలగచెట్టు రక్కసుని పైకి ఒడిసెలో రాయివలె విసరి చంపిన మీ దివ్యపాదములకు మంగళము. గోవర్ధన పర్వతమును గొడుగువలె ఎత్తిన మీ వాత్సల్యమునకు మంగళము. శత్రువులను హతమార్చు మీచేతి వేలాయుధము నకు మంగళము. ఇటువంటి మీ వీరచరిత్రమును కీర్తించుటకు వచ్చితిమి. 'పఱ' యను వ్రత సాధనమును ప్రసాదించి, కరుణింపుము.

## విశేషాంశములు :

శకటము అనగా బండి శ = సుఖమును, కట = ఛేదించునది. భగవత్ సంశ్లేషముతో ఆనందము పొందు జీవునకు సుఖమును పోగొట్టి, సంసారమున పడవేయును. అదే కర్మ. భగవంతుని పాదము తగులుటచే కర్మ నశించును. రుచి-వత్సాసురుడు, వాసన-కపిత్థాసురుడు. ఈ రెండును భగవద్ విషయమును అరికట్టును. గనుక వీనిని అడుగంటు జేసెను.

సన్ని వేశము : భగవానునికి మంగళము పాడుటయే పరమ పురుషార్థ మని భావించినవారు ఆ భగవానుడు శ్రీ కృష్ణుడేయని వారు గ్రహించినట్లు వివరించుట. గనుకనే ఈ పాశురమునందు శ్రీకృష్ణుని జన్మ వృత్తాంతమును వర్ణించుచున్నారు.

## పాశురము-25

ఒరుత్తి మగనాయ్ పిఱన్దు, ఓరి రవిల్
ఒరుత్తి మగనాయ్ ఒళిత్తు వళర,
తరిక్కిలా నాగిత్తాన్ తీఙ్గు నినైన్ద
కురుత్తైప్పిళై ప్పిత్తు కఞ్జన్ వయిత్తిల్
నెరుప్పెన్న నిన్ఱ నెడుమాలే! యున్నై
అరుత్తిత్తు వన్దోమ్ ; పఱై తరుతియాకిల్,
తిరుత్తక్క శెల్వముమ్ శేవకముమ్ యాంపాడి
వరుత్తముమ్ తీర్న్దు మగిళ్ న్దేలో రెమ్బావాయ్.

## గీతము-25

ఒకతె కొడుకుగ బుట్టి వేరొకతె బిడ్డవై
ఆ రాత్రి దాగి పెరుగగ తాను ఓపకే
కీడెంచు కంసు నెత్తులు చిత్తు గావించి
అతని పొట్టను వహ్ని వలె నుండి, ఆశ్రితుల
పక్షముందుండు నిన్ ప్రార్థింప వచ్చితిమి
శ్రీ రమాదేవి ఐశ్వర్యమ్ము వీరమ్ము

శ్రమ తీరగా మేము నతవి గానమొనర్చి,

నలినాక్ష! మిగుల నానందించు చున్నాము.

## భావము :

ఓ నలినాక్షా! ఒకతెకు అనగా దేవకీదేవికి కొడుకుగా జన్మించి, వేరొకతె యగు యశోదకు కొడుకుగా దాగి, పెరుగుచుండగా సహింపని వాడయి నీకు కీడు తలపెట్టు కంసుని ఎత్తులు చిత్తుగా చేసి, ఆ కంసుని గర్భమున అగ్నివలె నుండి, ఆశ్రితుల పక్షమందుండు నిన్ను ప్రార్థింపగా వచ్చితిమి లక్ష్మీ దేవి యొక్క ఐశ్వర్యమును, వీరమును మేము శ్రమ తీరునట్లుగా గానము చేసి, ఎంతో ఆనందమును పొందు చున్నాము.

## విశేషాంశములు :

శ్రీ కృష్ణున కిద్దరు తల్లులు. మనకు ప్రధానమైన మంత్రములు రెండు, 1. నారాయణాష్టాక్షరి, 2. వాసుదేవ ద్వాదశాక్షరి. నారములు అనగా శాశ్వతమైన సర్వ పదార్థములు. వాటికి అయనము (నార + అయనము) ఆధారమైనవాడు. ఇందు అహంకారమే కంసుడు.



సన్నివేశము : పెద్దలు ఆచరించిన వ్రతమును చేయుటకు గోపికలు వచ్చినట్లు తెలుపుట భగవంతునితో కలియుటకే ఈ వ్రతమాచరించుచున్నట్లు, అతని ముఖమును దర్శించుటకు, దివ్యనామములు కీర్తించుటకు వచ్చినట్లు చెప్పుట

## పాశురము-26

మాలే! మణి వణ్ణా! మార్గళి నీరాడు వాన్;
మేలైయార్ శెయ్వనగళ్ ; వేణ్డువన కేట్టియేల్;
ఞాలత్తై యెల్లామ్ నడుఙ్గ మురల్వన
పాలన్న వణ్ణత్తు ఉన్ పాఞ్జ శన్నియమే
పోల్వన శఙ్గఙ్గళ్, పోయ్‌ప్పాడు డైయనవే
శాలప్పెరుమ్ పఱైయే, పల్లాణ్డి శైప్పారే,
కోల విళక్కే, కొడియే, వితానమే,
ఆలినిలైయాయ్! అరుళేలో రెమ్బావాయ్.

## గీతము- 26

ఆశ్రిత వ్యామోహా! మణి వర్ణ! వటపత్ర
శాయి! ఈ మార్గశీర్ష స్నానమొనరింప
నేగుదెంచితి మార్యు లొనరించి రిద్దాని
వలయు పరికరములన్ వచియింతు మాలింపు!
జగమెల్ల వణకు నట్లుగ మోఁయు పాలు బోల్
వర్ణమ్ము గల నీదు పాంచజన్యము వంటి
శంఖముల్, మిగుల వైశాల్య వంతమ్ములౌ
'పఱ' వాద్యములును మంగళ గాన దీపికల్

కేతనమ్ము మ, వితానము, సాధనమ్ములును
కరుణన్ ప్రసాదింపు కమలాక్ష! మాకిపుడు.

భావము :

ఆశ్రిత వ్యామోహము గల మణివర్ణా! వటపత్రశాయా! ఈ విధమైన మార్గశీర్ష స్నానము చేయగోరి మేము వచ్చితిమి. ఈ వ్రతమును మన పూర్వులగు పెద్దలు ఆచరించి యున్నారు దానికి కావలసిన పరికరములను తెలిపెదము. ఆలకింపుము. లోకమంతయు వణకునట్లు మోగియునట్టి పాలవలె తెల్లనైన నీయొక్క పాంచజన్యమనెడి శంఖమును బోలిన శంఖములును, విశాలములగు చాల పెద్ద 'పఱ'వాద్యములును, మంగళ గానము చేయు గాయకులు, దీపము, జండా, మేలుకట్టు సాధనములు ఓ కమలాక్షా! మాకు దయతో ప్రసాదింపుము.

విశేషాంశములు :

పూర్వులగు పెద్దలు ఆచరించిరని గోపికలు చెప్పుటలో ఒకరు ఆచరించి, ఫలము సాధించిరన్న విశ్వాసము కన్పించును వ్రతమునాచరించుటకు శంఖము కావలెనని కోరుటలో శుభారంభము మంగళప్రదముగా చేయవలెనని భావించుటయే. శ్రీకృష్ణుని చేతియందు కలదియు అతని పెదవిని రుచి చూచినదియునైన శంఖము కావలెనని గోపికలు కోరుచున్నారు. శ్రీకృష్ణుని ఉచ్ఛ్వాసవాయువుచే పోషింపబడే శంఖము వలె గోపికలును తమ జీవితములు గడుపవలెనని భావించిరి. 'పఱ' అనగా ఆకారమున పెద్దదై, లోపల ఖాళీ ప్రదేశము గలిగి, ఎక్కువగా ధ్వనినిచ్చు తప్పెటలు, ఇవే గోపికల వాద్యములు.

సన్ని వేశము : గోపికలు తామాచరింప బోవు మార్గశీర్ష వ్రతమునకు కావలసిన పరికరములను తెలుసుకొనిన పిమ్మట,ఆ పరికరములను కోరగా శ్రీకృష్ణుడు గోపికలు తననే కోరి ఈ వస్తువులను కోరినట్లు ఈ పాశురమున భావించుట గోచరించును.

## పాశురము-27

కూడారై వెల్లుమ్ శీర్ గోవిన్దా! ఉన్దన్నై
ప్పాడి ప్పఱై కొణ్డు యామ్ పెఱు శమ్మానమ్,
నాడు పుగళుమ్ పరిశినాల్ నన్ఱాక
చ్చూడగమే, తోళ్ వళైయే, తోడే, శెవిప్పూవే,
పాడగమే, ఎన్ఱనైయ పల్ కలనుమ్ యామణివోమ్,
ఆడై యుడుప్పోమ్ ; అదన్ పిన్నే పాల్ శోఱు
మూడ నెయ్ పెయ్దు వళ్ఱై వళివార
క్కూడి యిరును కుళిర్ న్దేలో రెమ్బావాయ్.

## గీతము-27

విన్ను గూడని శతృ నిచయమ్ము ఛేదించు
గోవింద! కళ్యాణ గుణశీల! నిన్నున్
పొగడి కన్ పఱ వాద్యమును పొంది, మేమందు
సన్మానమును జగతి సన్నుతింపంగన్
కర కంకణాల్, దండ కడియముల్, చెవిపోగు
లున్, దుద్దులున్, కాలియందెలును మున్నుగా
దొడరు నగలన్ ధరింతుము మేము, వస్త్రాల
నలరి, పిమ్మట పాలు నన్నమ్ము మునుగగా

నెయి పోసి, మోచేతి పయినుండి కారగా
అరగించి సుఖమ్ము లందుదుము నీ తోడ.

## భావము :

గోవిందా! నిన్ను గూడని శత్రువులను ఛేదించు-కల్యాణ గుణ సంపద గల నిన్ను పొగడి, 'పఱ'వాద్యమును పొంది,లోకులచే కీర్తింప బడి, సన్మానము పొందెదము చేతులకు కంకణములు, దండ కడియ ములు, చెవి పోగులు, దుద్దులు, కాలియందెలు మొదలగు నగలను ధరిం చెదము మంచి చీరలు ధరించి, పాలు అన్నము మునగగా నేయిపోసి, మోచేతి మీదినుండి కారునట్లుగా నీతో కూర్చొని మేము అరగించి, సుఖము లందవలెనని గోపికలు తమ వ్రత ఫలమును చెప్పుకొనినారు.

## విశేషాంశములు :

భగవంతుని కూడనివారనగా శత్రువులని కాదు. లోకమున అభి ముఖులు, విముఖులు, ఉదాశీనులు (తటస్థులు) అని జనులు మూడు విధములుగా నుందురు. వీరు కూడా భగవంతుని గుణాతిశయమును గమనించి, తమవంటి నీచులు సర్వ గుణాధికుడైన భగవంతుని సమీ పింపక దూరముగుదురు. ఆళ్వార్లు, యామునాచార్యులవారు కూడా భగ వంతునికి దూరమైనారు ఇటువంటి వారిని చేరదీసి, భగవంతుడు కాపా డినాడు. కర్ణాభరణములలో పైనున్నది భక్తి, క్రిందనున్నది జ్ఞానము. పాదాభరణము వైరాగ్యము. అనుభవ పూర్వకమైన భగవంతుని సేవయే పాలు, అన్నము తినవలెనని వాంఛించుట.



సన్నివేశము : గోపికలు కోరినవి స్వామి ప్రసాదించుటకు వారికి గల యోగ్యతలేమో చెప్పమనగా, తాము పరమ పురుషార్థమగు నిరంతర భగవత్ సంశ్లేష పూర్వకమైన సేవయే యనియు, సేవ చేయుటకు తమకు యోగ్యతలు లేవని విన్నవించుట

## పాశురము-28

కఱవైగళ్ పిన్‌శెన్ఱు కానమ్ శేర్‌న్దుణ్బోమ్
అఱివొన్ఱుమిల్లాద వాయ్‌క్కులత్తు, ఉన్దన్నై
ప్పిఱవి పెఱున్దనై పుణ్ణియమ్ నాముడైయోమ్;
కుఱైవొన్ఱుమిల్లాద కోవిన్దా! ఉన్దన్నోడు
ఉఱవేల్ నమక్కిజ్గొళిక్క వొళియాదు,
అఱియాద పిళ్ళైగళోమ్, అన్బినాల్ ఉన్దన్నై
చ్చిఱుపేరళైత్తనవుమ్ శీఱియరుళాదే
ఇఱైవా నీతారాయ్ పఱైయేలోరెమ్బావాయ్.

## గీతము-28

పశుల మేపగ వెంటబడి యడవులకు పోయి
తిండికై జీవించి, తిరుగుచుందుము మేము
తెలివెరుంగని గోపకులమందు బుట్టితిమి
మా వంశమున నీవు పుట్టుటే పుణ్యమ్ము
కొదువేమి లేనట్టి గోవింద! నీ తోడ
మాకున్న చనవెప్డు మాసిపోనిది సుమ్ము;
పిన్నలము మర్యాదయన్న నెఱుగము మేము
చిన్న పేరున నిన్ను చేరి పిల్చితి మంచు

అనుగ్రహించవలె కరుణ నందించ గోరెదము
మా అపేక్షితమైన 'పఱ' సాధనము నిమ్ము.

## భావము :

గోవిందా! పశువులను మేపుకొనుటకై వాని వెంటబడి, అడవులకు పోయి, కేవలము తిండి కొరకే జీవించి మేము తిరుగుదుము. జ్ఞానమెఱుగని గోప వంశమున నీవు పుట్టుటయే మాకు పుణ్యము. ఏ లోపమును లేని నీతో మాకున్న చనవు ఎన్నడూ మాసిపోనిది. పిన్నవారమైన మేము మర్యాద యెఱుగము. నిన్ను చిన్న పేరుతో 'గోవిందా' అని పిలిచితిమని కోపించక, మేము అపేక్షించిన 'పఱ' సాధనమును మాకిమ్ము. అని గోపికలు కోరిరి

## విశేషాంశములు :

గోపిక లాశ్రయించిన పశువులే గురువులు. గనుకనే, వారికి భగవత్ సన్నిధికి సాధనము లేదని చెప్పుకొనినారు. వారు కేవలము తిండికి మాత్రమే జీవించువారని చెప్పుకొనుటలో భగవదనుగ్రహము కోరియే. తమ వంశమున భగవంతుడు జన్మించెనని చెప్పుటలో తమకు సన్నిహితుడను భావమున్నది. భగవత్ సన్నిధానమే వారి పుణ్యము కదా!



సన్నివేశము : శ్రీకృష్ణునితో ఎన్నడూ ఎడబాటు లేని విధముగా అత నికి సేవ చేయు భాగ్యమునే గోపికలు కాంక్షించుట. స్నానమనగా భగవత్ ప్రాప్తిగాను, 'పఱ' యనగా స్వామి సేవ యనెడి పరమ పురుషార్థమని వివరించుట.

## పాశురము-29

శిత్తమ్ శిఱుకాలే వన్దున్నై చ్చేవిత్తు, ఉన్
పొత్తామరై యడియే పోత్తుమ్ పొరుళ్ కేళాయ్;
పెత్తమ్మేయ్ త్తుణ్ణు జ్కులత్తిల్ పిఱన్దనీ
కుత్తేవ లెజ్గళై క్కొళ్ళామల్ పోకాదు;
ఇత్తై ప్పఱై కొళ్వా నన్ఱుకాణ్ ; గోవిన్దా!
ఎత్తైక్కు మేళేళు పిఱవిక్కుమ్, ఉన్దన్నో
డుత్తో మే యావో మునక్కే నామాళ్ శెయ్‌వోమ్,
మత్తై నజ్కా మజ్గళ్ మాత్తేలో రెమ్బావాయ్.

## గీతము-29

తెలవారకుండ మిమ్ములను సేవింపగా
వచ్చి, మీదగు రమ్య పాద పద్మములకున్
మంగళము పాడెదము మాహాత్మ్యమున్ వినుము ;
పశుల మేపి, భుజించు వర గోప వంశాన
రహి బుట్టితివి! అంతరంగ కైంకర్యముల్
మేమొనర్చెదు కాని ప్రీతి గైకొనుమయ్య!
నీ నుండి 'పఱ'ను గైకొనుటకై కాలేదు
ఇమ్ము నీ తోడనే ఏడేడు జన్మలకు

వరుస విడరాని అనుబంధమ్ము గోవింద!
నీ సేవలిమ్ము ; ఇంకే కోరికలు వలదు.

## భావము :

గోవిందా! తెల్లవారకుండగనే నిన్ను సేవించుటకు వచ్చి, నీ సుందరమైన పాదపద్మములకు మంగళము పాడెదము. మహాత్మ్యమును ఆలకింపుము. పశువులను మేపిన పిమ్మటనే భుజించు గోప వంశమందు నీవు జన్మించితివి. మేము చేయు అంతరంగిక సేవలను ప్రీతితో స్వీకరింపుము. నేడు నీనుండి 'పఱ'ను పుచ్చుకొనుటకై రాలేదు. ఏడేడు జన్మలకు నీతో విడరాని అనుబంధమును ఇమ్ము. ఇంకే కోరికలు వలదు. నీ సేవలే ప్రసాదింపుము.

## విశేషాంశములు :

తెల్లవారకుండ అనుటలో భగవంతునియందు అభిముఖులై నిద్ర పట్టక గోపికలు లేచిన వేళ అను భావమున్నది. పాదములపై దృష్టి నిలుపుట దాసుల లక్షణము. తాము మంగళము పాడునది భగవంతుని కొరకు. భగవంతుని దాస్యము నందలి అనురక్తియే గోపికలను అంతరంగిక సేవలకు పురి కొల్పినది. గోవు అనగా భూమి. స్వామి వరాహ అవతారమున భూమిని ఎత్తిన వాడగుటచే గోవిందుడయ్యెను. గోవు అనగా కిరణములు. వానిచే ప్రకాశించుచున్న సూర్యమండలములో వర్తించు నారాయణుడే గోవిందుడు. ఏడేడు జన్మలనుటలో శాశ్వతముగా, స్థిరముగా నని యర్థము.



సన్నివేశము : ఆండాళ్ ఈ విధముగా వ్రతమొనర్చి, గోపికలు పొందిన ఫలమును తాను పొందగలిగెనని వివరించుట. ఈ గీతములను అభ్యాసము చేసినవారికి తాను వ్రతము చేసి, పొందిన ఫలము లభింపవలెనని ఆశాసించుట.

## పాశురము-30

వఙ్గక్కడల్ కడైన్ద మాదవనై క్కేశవనై
త్తిఙ్గళ్ తిరుముగత్తు చ్చేయి ళైయార్ శెన్ఱిఱైఞ్జి
అఙ్గప్పఱై కొణ్డవాత్తై, యణి పుదువై
ప్పైఙ్గమ లత్తణ్డెరియల్ పట్టర్ పిరాన్ కోదైశొన
శఙ్గత్త మిళ్ మాలై ముప్పదుమ్ తప్పామే
ఇఙ్గిప్పరి శురైప్పారీరిరణ్డు మాల్వరైత్తోళ్
శెఙ్గణ్ తిరుముగత్తు చ్చెల్వ త్తిరుమాలాల్
ఎఙ్గుమ్ తిరువరుళ్ పెత్తిన్బుఱువ రెమ్బావాయ్.

'ఆండాళ్ తిరువడిగళే శరణమ్'

## గీతము-30

పడవలతో నిండారు పాల్కడలి నింజిల్కు
మాధవుని కేశవుని మహిమమైె నుతియించి
పర్వేందు ముఖులు దివ్యాభరణ భూషితలు
వ్రేపల్లె గోపికలు 'పఱ' వాద్యమును గొన్న
విధమెల్ల విశ్వమణి విల్లిపుత్తూరునన్
అవతారమంది తామర పూస మాలలన్
ధరియించు భట్టు నాథార్య సత్పుత్రియా
గోద వచియించగా గోపికలు తనివొంద

మాలగా నున్న ముప్పది గీతములనెల్ల
క్రమత(బఠియింప పర్వత శిఖరముల బోలు
నాల్గు భుజముల నెఱ్ఱనైన నేత్రములతో
శ్రీ వల్లభుడు కరుణ జిందు నానందంబు.
'శ్రీ గోదా దేవ్యై నమః'

## భావము :

పడవలతో నిండారిన పాల సముద్రమును తరచి, మాధవుడు, కేశవుడు అయిన వానిని, చంద్రముఖులు, దివ్యమైన ఆభరణములతో అలంకరించుకున్న వారు అయిన వ్రేపల్లెలోని గోపికలు ప్రార్థించి 'పఱ' యను వాద్యమును పొందిరి. ఈ విధమును ప్రపంచమునకు అలంకార ప్రాయమైన శ్రీ విల్లిపుత్తూరున అవతరించి, తామర పూస మాలను ధరించు శ్రీ భట్టనాథుల కుమార్తె యగు గోదాదేవి ద్రావిడ భాషలో మాలికగా కూర్చిన ముప్పది పాశురము (గీతము) లను క్రమము తప్పక పఠించినచో పర్వత శిఖరముల వంటి నాలుగు భుజముల తోడను, ఎఱ్ఱని నేత్రముల తోడను శ్రీ మన్నారాయణుడు ఆనందమును దయతో ప్రసాదించు గాక!

## విశేషాంశములు :

జీవాత్మను పొందుటకై పరమాత్మ చేయు ప్రయత్నము క్షీర సాగర మథన వృత్తాంతమున సూచింపబడినది.



# శ్రీ గోదా అష్టోత్తర శతనామ స్తోత్రమ్

శ్రీరంగ నాయకీ గోదా విష్ణు చిత్తాత్మజా సతీ
గోపీ వేష ధరా దేవీ భూ సుతా భోగశాలినీ॥ 1

తులసీ కాననోద్భూతా శ్రీధన్వి పురవాసినీ
భట్టనాథ ప్రియకరీ శ్రీకృష్ణ హిత భోగినీ॥ 2

ఆముక్త మాల్యదా బాలా రంగనాథ ప్రియాపరా
విశ్వంభరా కలా లాపా యతిరాజ సహోదరీ॥ 3

కృష్ణానురక్తా సుభగా సులభశ్రీః సలక్షణా
లక్ష్మీ ప్రియ సఖీ శ్యామా దయాంచిత దృగంచలా॥ 4

ఫల్గుణ్యావిర్భవా రమ్యా ధనుర్మాస కృత వ్రతా
చంపకాశోక పున్నాగ మాలతీ విలసత్కచా॥ 5

ఆకార త్రియ సంపన్నా నారాయణ సమాశ్రితా
శ్రీ మదష్టాక్షరీ మంత్ర రాజస్థిత మనోరథా॥ 6

మోక్ష ప్రదాన నిపుణా మంత్ర రత్నాధి దేవతా
బ్రహ్మణ్యా లోక జననీ లీలా మానుష రూపిణీ॥ 7

బ్రహ్మజ్ఞానుగ్రహా మాయా సచ్చిదానంద విగ్రహా
మహా పతివ్రతా విష్ణు గుణ కీర్తన లోలుపా॥ 8

ప్రపన్నార్తి హరా నిత్యా వేద సౌధ విహారిణీ
శ్రీ రంగనాథ మాణిక్య మంజరీ మంజు భాషిణీ॥ 9

సుగంధార్థ గ్రంథకరీ రంగ మంగళ దీపికా
ధ్వజ వజ్రాంకుశాబ్జాంక మృదు పాద తలాంచితా॥ 10

కారకాకార నఖతా ప్రవాళ మృదులాంగుళీ
కూర్మోపమేయం పాదోర్ధ్వ భాగా శోభన పార్ష్ణికా॥ 11

వేదార్థ భావ విదిత తత్త్వ బోధాంఘ్రి పంకజా
ఆనంద బుద్బుదాకార సుగుల్ఫా పరమాణుకా॥ 12

తేజశ్శ్రియోజ్జ్వల ధృత పాదాంగుళి సుభాషితా
మీన కేతన తూణీర చారు జంఘా విరాజితా॥ 13

కకుదజ్జాను యుగ్మాఢ్యా స్వర్ణ రంభాభ సక్థికా
విశాల జఘనా పీన సుశ్రోణీ మణి మేఖలా॥ 14

ఆనంద సాగరా వర్త గంభీరాంభోజ నాభికా
భాస్వద్వళిత్రికా చారు జగత్పూర్ణ మహోదరీ॥ 15

నవమల్లీ రోమరాజీ సుధా కుంభాయత స్తనీ
కల్ప మాలా నిభ భుజా చంద్ర ఖండ నఖాంచితా॥ 16

సుప్రవాళాంగుళీ న్యస్త మహా రత్నాంగుళీయకా
నవారుణ ప్రవాళాభ పాణీ దేశ సమంచితా॥ 17

కంబు కంఠీ సుచుబుకా బింబోష్ఠి కుంద దంత యుక్
కారుణ్య రస నిష్యంది నేత్ర ద్వయ సుశోభితా॥ 18

ముక్తా సుచిస్మితా చారు చాంపేయ నిభ నాసికా
దర్పణాకార విపుల కపోలద్వితయాంచితా॥ 19

అనంతార్క ప్రకాశోద్యన్మణి తాటంక శోభితా
కోటి సూర్యాగ్ని సంకాశ నానాభూషణ భూషితా॥ 20

సుగంధ వసనా సుభ్రూః అర్ధ చంద్ర లలాటికా
పూర్ణ చంద్రాననా నీల కుటిలాలక శోభితా॥ 21

సౌందర్య సీమా విలస త్కస్తూరీ తిలకోజ్జ్వలా
ధగద్ధగాయ మానోద్యన్మణి సీమంత భూషణా॥ 22

జాజ్వల్యమాన సద్రత్న దివ్య చూడావతంసికా
సూర్యార్థ చంద్ర విలసద్భూషణాంచిత వేణికా॥ 23

నిగ న్నిగ ద్రత్న పుంజ ప్రాంత స్వర్ణ నిచోళికా
సద్రత్నాంచిత విద్యోత ద్విద్యుత్పుంజాభ శాటికా॥ 24

అత్యర్కానల తేజోధి మణి కంచుక ధారిణీ
నానా మణి గణా కీర్ణ హేమాంగద సుభూషితా॥ 25

కుంకుమాగరు కస్తూరీ దివ్య చందన చర్చితా
స్వోచితౌజ్జ్వల్య వివిధ విచిత్ర మణి హారిణీ॥ 26

అసంఖ్యేయ సుఖ స్పర్శ సర్వాతిశయ భూషణా
మల్లికా పారిజాతాది దివ్య పుష్ప స్రగంచితా॥ 27

శ్రీరంగ నిలయా పూజ్యా దివ్య దేశ సుశోభితా
ఏవం శ్రీరంగ నాయక్యాః నామ్నా మష్టోత్తరం శతమ్॥ 28

యో నరః పఠతే నిత్యం నిత్య నిర్వాణ సంపదమ్
లబ్ధ్వా రంగ పతేర్దాస దాస భక్తో భవిష్యతి॥ 29

శ్లో॥ రంగి నేత్ర శరేణ తాడిత తనుశ్చైతే స్వయం సుందరో
బద్ధశ్చమ్పకదామ సుస్తన తటీ మగ్నోంబుజ నాదీశ్వరః।
భోగా పాటవ లజ్జయా వటు మహాధామా ఫణీంద్రే వ్రత
ద్రిమ్యే శస్తవ విస్మితేన మనసా గోదే పరం తిష్ఠతి॥

# స్వస్తి

భూలోకమ్మున సర్వ ప్రాణులకు స
ద్బుద్ధిన్ ప్రసాదించి, 'గో
దా' లక్షింపగ, సౌఖ్య సంపదలఁ బ్రో
ద్యల్లిలఁ గైసేసి, తా
హేలన్ కృష్ణుఁడు పారమార్థికత సం
ధించంగ, శ్రీ శాంతిమై
వాలారన్ మనుపున్ నిరంతరము న
వ్యాజ క్రియా సిద్ధిమై.